Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు స్థాపితం: 1930 జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 81 • సంచిక: 22 • 28-5-2010 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-





## కెకెకు కెవిపి స్పాట్!

రాష్ట్ర రాజకీయాలలో వైఎస్‌ఆర్‌ను, ఆయన కుమారుడు వైఎస్ జగన్‌ను వ్యతిరేకించే వారికి పుట్టగతులు లేకుండా చేసినప్పుడే తన స్నేహితుడి ఆత్మకు శాంతి కల్గించిన వాడినౌతానని భావిస్తున్నాడు కెవిపి.రామచంద్రరావు. వైఎస్‌ఆర్ మరణం తర్వాత ఆయన్ను చులకన చేస్తూ మాట్లాడిన వి.హనుమంతరావు కెవిపి జాబితాలో మొదటివాడు. విహెచ్‌కు మళ్లీ రాజ్యసభ సభ్యత్వం రాకుండా చూడడానికి తన శక్తియుక్తులన్నీ ప్రయోగించాడు కెవిపి. విహెచ్‌కు టిక్కెట్ ఇస్తే, తిరుగుబాటుకు కూడా సిద్ధమని బెదరించాడు. తమ మాట నిర్లక్ష్యం చేస్తే రోశయ్య ప్రభుత్వాన్ని పడగొడతామని సంకేతమిచ్చాడు. తమ హెచ్చరికలు, బెదరింపు సందేశాలు బాగానే పని చేశాయని, అధిష్టానం జాబితాలో విహెచ్ పేరు లేదని సంతోషంగా చెప్పుకొంటున్నాడు కెవిపి. ఆ తర్వాత తాను స్పాట్ పెట్టబోయేది కె.కేశవరావుకని పబ్లిక్‌గా చెప్తున్నాడాయన. వైఎస్ బ్రతికి వున్నప్పుడు, పిసిసి అధ్యక్షత కోసం తన కాళ్లు పట్టుకొని బ్రతిమలాడిన కెకె, కుమారుడిని హత్యకేసు నుంచి తప్పించమని కళ్లనీళ్లు పెట్టుకొని ప్రాధేయపడిన కెకె, ఇప్పుడు జగన్ వ్యతిరేక లాబీకి నేతగా వ్యవహరించడం కెవిపి రామచంద్రరావుకు కోపం తెప్పించింది. తమ దయతో ఢిల్లీ వరకు వెళ్లిన కెకె అంతు చూస్తానంటున్నాడు. కెవిపి స్పాట్ నుంచి కెకె తప్పించుకొంటాడో లేక హతమై పోతాడో వేచి చూడాలి.

## కార్టూన్ స్కేప్




వాళ్లందరికీ ధైర్యం చెప్పి...
నువ్విలా అధైర్యపడితే ఎలా బావా...?!

● ఢిల్లీ దివాణం

# జగన్ దెబ్బకు జడిసిందా?

వరంగల్ జిల్లాలో వైఎస్ జగన్ ఓదార్పు యాత్రను నివారించడానికి కాంగ్రెస్ పెద్దలు చేసిన ప్రయత్నం ఫలించలేదు. ఎవరేమనుకొన్నా పర్యటన మానేది లేదని భీష్మించుకొన్న జగన్‌కు ఎట్లా నచ్చచెప్పాలో అర్థంకాక కాంగ్రెస్ అధిష్టానం సైతం తలపట్టుకొంటున్నది. జగన్ పర్యటనలో ఆయన తండ్రి మరణం వల్ల కల్గిన ఖేదాన్ని తట్టుకోలేక గుండె ఆగి కన్ను మూసిన వారి కుటుంబాలను ఓదార్చడం అన్నది ఒక లాంఛనప్రాయం మాత్రమే. ఈ యాత్ర అసలు ఉద్దేశం ఆధిపత్య ప్రదర్శన. రాష్ట్ర కాంగ్రెస్‌లో తానొక్కడే జనాకర్షణ కల్గిన నేతనని రుజువు చేయడానికి జగన్ ఈ యాత్ర తలపెట్టాడని అందరికీ తెలుసు. కేవలం ఓదార్పే ఉద్దేశ్యమైతే, తానొక్కడు నేరుగా కారేసుకొని వారి ఇళ్లకు వెళ్లి, ఓపికున్నంత సేపు కూర్చొని, ఓదార్పు మాటలు చెప్పి తిరిగి రావచ్చు. దానికి ఎవరూ అభ్యంతరపెట్టరు. కానీ జగన్ పర్యటనలు రాజు వెడలే... రవితేజములరయగ... అన్నట్లు నడుస్తున్నాయి. వారం రోజుల ముందు నుంచే ఆయా జిల్లాలలో తన అనుచరులను సమాయత్తం చేస్తున్నారు. వందలాది వాహనాల బారుతో కదలుతున్నారు. దారి పొడవునా పూల వర్షం, జై జై నినాదాలు. మధ్యలో ఆగిన దగ్గరల్లా రాష్ట్రంలో త్వరలోనే స్వర్ణయుగం ప్రారంభం కానున్నదన్న ప్రకటనలు. స్వర్ణయుగం అంటే తాను ముఖ్యమంత్రి కావడమని అర్థం. ఈ యువరాజులుంగారి జైత్ర యాత్రలోని పరమార్థం కాంగ్రెస్ అధిష్టానానికి హెచ్చరిక జారీ చేయడమన్న నిజం పాలు త్రాగే పసి పిల్లవాడికి కూడా తెలుసు. నా జనం, నా బలం చూసి అయినా నన్ను ముఖ్యమంత్రిని చేయండని ఒత్తిడి పెంచడమన్నమాట. గోదావరి, ఖమ్మం జిల్లాలో జరిగింది అదే.

వరంగల్ జిల్లాలో అదనపు సమస్య – తెలంగాణ ఉద్యమం. ప్రత్యేక రాష్ట్రం విభజనకు సుముఖం కాని జగన్ ప్రత్యేక రాష్ట్ర ఉద్యమం ఉధృతంగా జరిగే వరంగల్ జిల్లా వీధులలో తిరగడం అంటే తెలంగాణ వాదులను గేలి చేయడమే అన్న భావన ప్రచారమౌతున్నది. దీన్ని సహిస్తే, తెలంగాణ ఉద్యమమే ఎగతాళి పాలౌతుందన్న అభిప్రాయం ఏర్పడుతున్నది. దానితో టిఆర్ఎస్‌తో పాటు అన్ని రాజకీయ పార్టీలలోని తెలంగాణవాదులు జగన్ పర్యటనను వద్దని అభ్యంతరం చెప్తున్నారు. ఆయన తమ జిల్లాకు వస్తే అడ్డుకొంటామని హెచ్చరిస్తున్నారు. శ్రీకృష్ణ కమిటీ వల్ల తెలంగాణలో ప్రశాంతంగా వున్న రాజకీయ వాతావరణం జగన్ పర్యటనతో అల్లకల్లోలం అవుతుందన్నది అందరి భావన. పోలీసు కూడా అదే మాట చెప్తున్నది. జగన్ పర్యటనలో తెలంగాణవాదులు సృష్టించే అడ్డంకులను తాము ఆపలేమని, పరిస్థితి అదుపు తప్పితే తమ బాధ్యత లేదని తేల్చి చెప్పారు వారు. కాంగ్రెస్ ఎమ్పీలు 11 మంది ఢిల్లీ పెద్దలకు ఆ మాటే చెప్పారు.

ఇన్ని ప్రమాదాలు కళ్ల ముందు కన్పిస్తున్నా

కొరవ 14వ పేజీలో

# వీరనారీమణులకు వందనం!

రుచిక అనే పద్నాలుగేళ్ల బాలికను లైంగికంగా వేధించినందుకు హర్యానా మాజీ డైరక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్ రాథోడ్‌కు ఒకటిన్నర ఏడాది కఠిన కారాగార శిక్ష విధించింది న్యాయస్థానం. దేశవ్యాప్తంగా సంచలనం సృష్టించిన తీర్పు ఇది. రుచిక, ఆమె స్నేహితురాలు అనురాధ టెన్నిస్‌లో ప్రపంచ స్థాయి క్రీడాకారిణులుగా ఎదగాలని కలలు కనేవారు. ప్రతి రోజూ క్రీడా మైదానానికి వెళ్లి సాధన చేసేవారు. అప్పట్లో రాథోడ్ హర్యానా క్రీడా సంస్థ అధినేత. ఆయన కన్ను, ఈ పసి మొగ్గలపై పడింది. ఏదో పని వున్నట్లు తన గదిలోకి పిలిచి, అత్యాచారానికి ప్రయత్నించారు. అనురాధ ఆ దృశ్యాన్ని చూసి గట్టిగా అల్లరి చేయడంతో వదలి పెట్టాడు. ఈ దుర్మార్గం రుచిక పసి మనసును తీవ్రంగా గాయపరచింది. రాథోడ్‌కు ఎట్లయినా బుద్ధి చెప్పాలన్న పట్టుదలతో, ఈ దుర్మార్గం మీద పోలీసు కేసు పెట్టింది. కానీ హర్యానా పోలీసులు దాన్ని రిజిష్టర్ చేయడానికి ఇష్టపడలేదు. పత్రికలు, మానవతావాదులైన న్యాయవాదుల సహకారంతో ఈ అంశానికి జాతీయస్థాయి ప్రచారం కల్పించింది ఆ బాలిక. దాన్ని తట్టుకోలేక ఆ పసికూన మీద తన ప్రతాపం చూపించాడు రాథోడ్. ఆమె ఎక్కడకి వెళ్తే అక్కడకు స్థానిక గూండాలు వెంటబడేవారు. కారుకూతలతో వేధించేవారు. ఆమె ఇంటి మీద రాత్రిపూట రాళ్లు విసిరేవారు. ఆమె అన్న మీద కార్ల దొంగతనం వంటి తప్పుడు కేసులు పెట్టి, రోజుల తరబడి పోలీసు స్టేషన్‌లో నిర్బంధించి చిత్రహింసలు పెట్టారు. చివరకు రుచికను ఆమె చదివే స్కూల్ నుంచి బయటకు పంపించారు. ఈ ఒత్తిడి తట్టుకోలేక ఆ అమాయకపు బాలిక ఆత్మహత్య చేసుకొన్నది. దానితో దేశమంతా గగ్గోలు రేగింది. న్యాయస్థానం సిబిఐ విచారణకు ఆదేశించింది. అయినా సరే రాథోడ్ తన పలుకుబడితో కేసును నీరుగార్చగలిగాడు.

రుచిక మరణంతో ఆమె స్నేహితురాలు అనురాధ ఈ కేసును చేపట్టింది. అప్పటికి ఆమె వయస్సు కేవలం 17ఏళ్లు. అన్నెం పున్నెం తెలియని వయస్సులో ఆమె వీరోచిత పోరాటానికి శ్రీకారం చుట్టింది. రుచిక వలెనే ఆమె మీద కూడా తన వికృత బలాన్ని ప్రయోగించాడు రాథోడ్. కానీ స్నేహితురాలి ఆత్మకు శాంతి చేకూర్చాలనే పట్టుదలతో అనురాధ ఆ ఒత్తిడులను తట్టుకొన్నది. ధైర్యంగా ఎదిరించి పోరాడింది. కోర్టు తర్వాత కోర్టుకు వెళ్తూ 17ఏళ్లపాటు కేసును కొనసాగించింది. ఎట్టకేలకు చిట్టచివరకు రాథోడ్‌ను శిక్షించింది న్యాయస్థానం. ఒకటిన్నర సంవత్సరం కఠిన కారాగారానికి పంపింది.

ఈ దేశంలో పలుకుబడి కల్గినవారు, అధికారాన్ని చేతుల్లో పెట్టుకొన్నవారు, అవినీతితో అక్రమార్జన చేసి, ఆ డబ్బును విచ్చలవిడిగా వెదజల్లకల్గిన వారు చట్టాన్ని తమ చుట్టంగా మార్చుకోవడం ఎంత సులువో రుచిక కేసు తీరుతెన్నులు గమనిస్తే అర్థమౌతుంది. ఆ దురన్యాయాన్ని సరిదిద్దడానికి ఒక బాలిక తన జీవితాన్ని పణంగా పెట్టవలసి వస్తే, మరొక బాలిక జీవితంలో మరిచిపోలేని చేదు జ్ఞాపకాలను మూటగట్టుకోవలసి వచ్చింది. హర్యానా హైకోర్టుకు చెందిన ఒక మానవతావాది ఇన్నేళ్లపాటు ఆమెకు అండగా నిలబడ్డాడు. రూపాయి ఫీజు తీసుకోకుండా కేసు వాదించాడు. అయితే ఇదే సమయంలో హర్యానాకు ముఖ్యమంత్రులైన రాజకీయవాదులు మాత్రం రాథోడ్‌ను అందలం ఎక్కించడంలో పోటీపడ్డారు. ఓంప్రకాష్ చౌతాలా అయితే ఆ నీచుడిని ఏకంగా డిజిపి పోస్టులో నియమించాడు. చట్టాలు చేసే నేతలు వాటిని పరిష్కరించవలసిన అధికారగణం సమస్తం ఒక్కటై, ఒక అమాయక బాలికకు జరిగిన దురన్యాయంపై చట్టం తన పని తాను చేసుకోకుండా అడ్డు తగిలిన తీరు చూస్తే కడుపు మండి పోతుంది.

ఎంత మంది రుచికలు, ఎంతమంది అనురాధలు ఇంత పట్టుదలతో పోరాటం చేయగలరు? ఉన్నతస్థానాలలో వున్న వారిని ఎదిరించి నిలవగలరు? అధికార పీఠంపై కూర్చుని అక్రమాలు చేసుకొనే ఉన్నతస్థాయి వ్యక్తులకు చట్టాన్ని వర్తింపచేయాలంటే ఇంత ప్రయాస పడవలసి రావడం మన వ్యవస్థ వైఫల్యానికి నిదర్శనం. అదే సమయంలో, ఏ అండా, ఆదరణ లేని సాధారణ వ్యక్తులు కూడా పట్టుదలతో పోరాడితే ఎంత పెద్ద వారినైనా చట్టం ముందు దోషులుగా నిలబెట్టవచ్చుననేందుకు ఈ కేసు ఒక ఉదాహరణ. రాథోడ్ వంటి కీచకుల మదమణచడానికి రుచిక, అనురాధ వంటి వీరనారీమణులు మన మధ్యలో వున్నందుకు ఆనందం కలుగుతున్నది.

## జనవాణి

### సంతపేట మార్కెట్‌ను అభివృద్ధి చేయండి!

70ఏళ్ల చరిత్ర కల్గిన సంతపేట మార్కెట్ నేడు దుస్థితిలో వుంది. వ్యాపారాలు చేస్తున్న అంగళ్లు వురుస్తున్నాయి. స్లాబులు పెచ్చులూడి పైన పడుతున్నాయి. పరిసర ప్రాంతాలలో మురుగునీటి పారుదల సౌకర్యం లేకపోవడం, చెత్తాచెదారం చేరి దుర్గంధం వెదజల్లుతోంది. వర్షం వస్తే మార్కెట్ మొత్తం జలమయమవుతుంది. ఈ మార్కెట్ స్థానే కొత్త మార్కెట్ కట్టేందుకు పురపాలక శాఖామాత్యులు తగిన చర్యలు తీసుకోమనవి.

*దొనెపూడి కోటేశ్వరరావు, నెల్లూరు*

### సాహిత్యధీర – వేటూరి

తెలుగు చలనచిత్ర సీమలో అద్భుత పాటల రచయితగా పేరుగాంచిన వేటూరి సుందరరామ్మూర్తి కన్ను మూశారు. ఆయన కలం నుంచి ముక్తి, భక్తి, శృంగారం, ఆవేదన, చలాకీ, జానపద పాటలు పదివేలకుపైగా వెలువడ్డాయి. ఏరోజూ నిర్మాత, దర్శకులతో పాటు సంగీత దర్శకులను ఇబ్బంది పెట్టని పాటల రచయితగా పేరుగాంచారు. తెలుగుభాషకు ప్రాచీన హోదా ఇవ్వని కేంద్ర ప్రభుత్వ నిర్ణయాన్ని నిరసిస్తూ తన పాటకు వచ్చిన జాతీయ అవార్డును తిరస్కరించిన భాషాభిమాని వేటూరి. ఆయన పాటలు వినపడుతున్నంత కాలం ఆంధ్రులు వేటూరిని మరచిపోలేరు.

*బి.శ్రీమన్నారాయణ, నెల్లూరు.*

### కరణాలంటే చులకనా?

ఇటీవల నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే, తెలుగుదేశం పార్టీ నేతను విమర్శిస్తూ కరణాలతో పోల్చి అసభ్యంగా మాట్లాడారు. కరణాల వ్యవస్థ అనాదిగా మనరాష్ట్రంలో వుండేది. కరణాలు తెలివిగలవారని ఎన్నోసార్లు బ్రిటిష్ పాలకులు సైతం ప్రశంసించారు. కరణాల వ్యవస్థ రద్దవ్వడం వల్ల గ్రామాల్లో ఎటువంటి రికార్డులు లేకుండాపోయాయి. కరణాలను అసూయపరులన్న అ'వివేకు'లపై పాత కరణాల సంఘం స్పందించాల్సి వుంది.

*ఆర్.ఆంజనేయశర్మ, చైతన్యపురి*

### ఆలోచింపజేసిన సంపాదకీయం!

జమీన్‌రైతులో ఇటీవల 'ఎవరిదిహింస' పేరిట ప్రచురితమైన సంపాదకీయం ఆలోచింపజేసింది. స్వతంత్ర భారతదేశం దోపిడీదార్లకు స్వర్గధామమ

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

31-5-1940
పేజీలు : 16 వెల: అణా

### ఫాసిస్టు హయాము – స్త్రీల దౌర్భాగ్య జీవనం!

ఫాసిజం అంటే దౌర్జన్యం ద్వారా పరిపాలన సాగించడమన్నమాట. ఇటలీలో ఫాసిస్ట్ పరిపాలన ఏర్పడినప్పటి నుంచి స్త్రీలు ఎంతటి దుర్గతిని అనుభవించవలసి వస్తున్నదో అన్య దేశాలలో వుండే ప్రజలకు సమగ్రంగా తెలియదు. ఇటలీ పరిపాలకుడు ముసోలినీ యిలా చెప్పాడు.

"స్త్రీలు, పురుషులు గీచే గీటు దాటకూడదు. పురుషులకు లొంగి వుండాలి. స్త్రీలకు ఓటింగ్ హక్కు యిచ్చినట్లయితే నా ప్రజలు నన్ను చూసి నవ్వుతారు. మా ఇటలీ లాంటి రాజ్యంలో స్త్రీలకు ఏవిధమైన ప్రాధాన్యతా వుండకూడదు."

ఇటలీ దేశస్థుడు తన భార్యనూ, పిల్లలనూ ఎంత చావచితకయినా కొట్టవచ్చు. ఎముకలు మాత్రం విరగకుండా వుంటేసరి. దెబ్బలు తిన్నవాళ్లు చస్తే ఫిర్యాదు చేయరు. ఫిర్యాదు చేస్తే మరొకసారి మరీ తీవ్రంగా దెబ్బలు తగులుతవని.

కొత్తగా పెళ్లి చేసుకొన్న పద్నాలుగేళ్ల పిల్ల భర్త పెట్టే బాధ పడలేక ఇంటి నుంచి పారిపోతే పోలీసువాళ్లు ఆ అమ్మాయిని వెంటాడి పట్టుకొని తీసుకువచ్చి భర్తకు అప్పగించాలి. ఆమె తన నేరానికి ఒక ఏడు శిక్ష అనుభవించవలసి వుంటుంది. భర్తకు ఇట్లాంటి నిబంధనలు ఏమీ లేవు. భార్య వ్యభిచరించినట్లయితే ఇటలీలో కనీసం రెండేళ్లు శిక్ష విధించవచ్చు. భర్త ఎలా తిరిగినా ఏ ఇబ్బందీ, ఏ శిక్ష లేదు.

చిన్న పిల్లలను మొగవాళ్లు ఎవరెన్నివిధాల చెరిచినా న్యాయశాస్త్రం ప్రకారం నిరాక్షేపణీయం. చిన్న పిల్ల అయినప్పటికీ సంభోగానికి అంగీకరించింది అన్న సాకు చూపితే అధర్మ శాస్త్రానికి నోళ్లు మూతబడతవి.

### పెండ్లాల అమ్మకం

ఆఫ్రికాలోని నైజీరియాలో నీగ్రో రిపబ్లిక్ పెండ్లాలను అమ్మడం అంగీకరించింది. ఒక్క పెండ్లాం ఖరీదు 12 పౌనులు. వాయిదాల వారీగా కూడా చెల్లించవచ్చు.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

27-5-1960
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### మంత్రివర్గ వివాదం

కాంగ్రెస్ అధ్యక్షులు నీలం సంజీవరెడ్డి గారు సుబ్బారెడ్డి గారిని మంత్రివర్గంలో వుంచుటకు గట్టి ప్రయత్నం జేస్తున్నారని, పార్లమెంటరీ బోర్డు చేత తదనుగుణంగా నిర్ణయం చేయించగలరని, ప్రధాని నెహ్రూ చేత గూడా ఒప్పించగలరనే విశ్వాసం వారికున్నదని, అందువల్ల మంత్రివర్గ వివాదం సుబ్బారెడ్డికి సుముఖం కావచ్చునని ఒక వర్గంలో పూర్తి ఆశాభావం కనుపిస్తున్నది.

అట్లనే అల్లూరి వర్గం ఈ వ్యవహారం తమకు అనుకూలం కాగలదని భావిస్తున్నట్లు తెలుస్తున్నది. పార్లమెంటరీ బోర్డు సుబ్బారెడ్డిని మంత్రిగా కొనసాగించవలసిందిగా ఆదేశమివ్వదని, నెహ్రూ బోటి పెద్దలు సామరస్యంగా పోవలసిందిగా ముఖ్యమంత్రికి వ్యక్తిగతంగా సలహా యివ్వవచ్చునని, కాని సుబ్బారెడ్డికి సంబంధించిన వ్యవహారమంతా ప్రధాని ముందు పెట్టినపుడు, వారు గూడా సలహా యివ్వలేదని, అందువల్ల ఈ వివాదం తమకు అనుకూలం కావడం ఖాయమని అల్లూరి వర్గం అభిప్రాయపడుతున్నదట.

ఈ ఇరువర్గాల ఆశాభావాల్లో ఎవరిది సఫలమౌతుందో చెప్పలేము. కానీ కాంగ్రెస్ అధ్యక్షుడు ఢిల్లీకి చేరిన వెంటనే, కాంగ్రెస్ కార్యదర్శి సాదిక్ అలీ హైదరాబాదుకు రావడం, మంత్రివర్గ ప్రతిష్టంభనకు సంబంధించి ఉభయ వాదాలను పరిశీలించనుండడాన్ని బట్టి, ఈ వ్యవహారమంతా సామరస్యంగానే సర్దుబాటుగా వచ్చునని, పార్లమెంటరీ బోర్డు నిర్ణయం సుబ్బారెడ్డిగారికి అనుకూలంగా ఉండవచ్చునని ఊహించతగి వున్నది.

### సుబ్బారెడ్డి గారి పట్ల సానుభూతి

మంత్రివర్గంలో ఆదిలో లేనంత సానుభూతి సుబ్బారెడ్డి పట్ల యిప్పుడు పెరిగింది. మంత్రులలో కొందరు బ్రహ్మానందరెడ్డి, కె.వి.రంగారెడ్డి, లక్ష్మణ్, నరసింగరావు ప్రభృతులు సుబ్బారెడ్డిని సమర్థిస్తూ ఈ సమస్య సుఖాంతం కావాలని కోరుతున్నట్లు తెలుస్తుంది.

# నెల్లూరు ముచ్చట్లు

## కళలేని చంద్రమోహనుడు!

సహజంగా నేతలు పదవుల కోసం పరితపిస్తుంటారు. కానీ తెలుగునేత సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి ఐదవసారి జిల్లా పార్టీకి అధ్యక్షునిగా ఎన్నుకొంటే ససేమిరా అన్నారు. చంద్రబాబునాయుడు మూడుసార్లు ఫోన్‌లో ప్రత్యేకంగా నచ్చజెబితేగానీ 'ఊహు' అనలేదాయన. జిల్లా తెలుగుదేశం పార్టీ అధ్యక్ష బాధ్యతలు ముళ్ల కిరీటమని పార్టీ నాయకులందరికీ తెలుసు. అందరూ దీనికి సోమిరెడ్డే అర్హుడనేసరికి ఆయన మొహం కళ తప్పింది. అయిష్టంగానే ఆ బాధ్యతలు స్వీకరిస్తామని చెప్పకతప్పలేదాయనకు.

## గనులను త్రవ్విన ఆదాల

రాష్ట్రంలోని ఇనుప ఖనిజం, గ్రానేట్, ఇసుక త్రవ్వకాలను జాతీయం చేస్తే 18,300 కోట్ల రూపాయలు ప్రభుత్వ ఖజానాలో జమ అవుతుందని సర్వేపల్లి ఎమ్మెల్యే ఆదాల ప్రభాకర్‌రెడ్డి లెక్కల చిట్టా బయటపెట్టారు. రాష్ట్ర ప్రభుత్వం ఇప్పటివరకు అందరి వద్ద చేసిన అప్పును గనులను జాతీయం చేస్తే కేవలం 15 రోజుల్లో తీర్చేయవచ్చన్నారు. వీటి జాతీయకరణ వల్ల వచ్చే ఆదాయంలో రాష్ట్ర ప్రజలకు రెండు పూటలా క్యారియర్ భోజనాన్ని ఇబ్బంది లేకుండా పెట్టొచ్చన్నారు. ఈ విషయాలు వింటుంటే గనుల వెనుక ఎంత అవినీతి దాగుందో అర్థం చేసుకోవచ్చు.

## రంగడి సేవకుల ప్రమాణం

నెల్లూరీయుల ఆరాధ్యదైవం తల్పగిరి రంగనాథ స్వామి దేవస్థానం నూతన పాలక మండలి ప్రమాణ స్వీకారోత్సవం 24వ తేది వైభవంగా జరిగింది. ఛైర్మన్‌గా ప్రత్తి రవీంద్రబాబు చేత దేవాదాయ శాఖ సహాయ కమిషనర్ బి.మహేశ్వరరెడ్డి ప్రమాణ స్వీకారం చేయించారు. ఈ కార్యక్రమంలో పురపాలక మంత్రి ఆనం రామనారాయణ రెడ్డి, నెల్లూరు ఎమ్పీ మేకపాటి రాజమోహన్‌రెడ్డి, ఎమ్మెల్యేలు వివేకానంద రెడ్డి, శ్రీధర్‌కృష్ణారెడ్డిలు ముఖ్య అతిథులుగా విచ్చేసి పాలకవర్గానికి దిశ–దశ నిర్దేశించారు. దేవస్థానంలో పగల్‌వత్తు మండపాన్ని స్వంత నిధులతో నిర్మిస్తానని ఎమ్పీ రాజమోహన్‌రెడ్డి ఈ సందర్భంగా వాగ్దానం చేశారు.

కొరవ 14వ పేజీలో









రాష్ట్ర పురపాలకశాఖ మాత్యులు శ్రీ ఆనం రామనారాయణరెడ్డి గారి నుండి ప్రశంసలు అందుకుంటున్న జి.లీలావెంకయ్య





స్కూల్ టాపర్ ఎస్.కె.షారూక్‌ని అభినందిస్తున్న కరస్పాండెంట్

571



Sk.Sharukh

565



K.Penchala Narayana

560



P.Roop Sai Krishna Reddy

558



Manasa Vaishnavi

550



Lakshmi Saranya

# బతుకు భారమయ్యింది!



విపరీతంగా రేట్లు పెరిగిన కూరగాయలు, పప్పులు.

నిత్యావసర వస్తువులు, కూరగాయలతోపాటు బతకడానికి అవసరమైన సమస్త వస్తువుల ధరలు విపరీతంగా పెరిగిపోవడంతో సామాన్య, మధ్యతరగతీయులు అల్లాడిపోతున్నారు. లైలా తుఫాన్ తర్వాత ఒక్కసారిగా మార్కెట్‌లో వస్తువుల ధరలన్నీ పెరిగిపోయాయి. నెల్లూరు మసూరి ధాన్యానికి గిట్టుబాటు ధర లేక రైతులు అల్లాడుతుంటే మసూరి బియ్యం కిలో 32 రూపాయలుగా మార్కెట్‌లో విక్రయిస్తున్నారు. నిత్యావసర వస్తువులైన పెసలపప్పు కిలో వంద రూపాయలైతే కందిపప్పు 80 రూపాయలుగా అమ్ముతున్నారు. మినపప్పు సైతం 80 రూపాయలయ్యింది. చింతపండు ఏగ్రేడ్ రకం వంద రూపాయలు, మిరపకాయలు సైతం అదే రేటు పలుకుతున్నాయి. సన్‌ఫ్లవర్ ఆయిల్ ధర మాత్రం కిలో 55 రూపాయల దగ్గర స్థిరంగా వుంది. నిత్యావసరాలకు తోడు కూరగాయల ధరలు కొండెక్కి కూర్చున్నాయి. పచ్చిమిర్చి, అల్లం లాంటివి కిలో వంద రూపాయలుగా అమ్ముతున్నారు. బీన్స్, క్యారెట్, పందిరి చిక్కుళ్లు కిలో 60 రూపాయల పైమాటే. వర్షాలకు ఏ మాత్రం దెబ్బతినని టమోటా పంటను కుంటిసాకులు చెబుతూ కిలో 20 రూపాయలుగా నిలబెట్టి అమ్ముతున్నారు. నెల్లూరు వంకాయలు సైతం కిలో 30 రూపాయల నుంచి ఒక్కమెట్టు తగ్గడం లేదు.

**నిత్యావసరాలు, కూరగాయలతోపాటు సమస్త వస్తువుల ధరలు పెరిగాయి**

కోడిగుడ్లు డజను 34 రూపాయలుగా రికార్డు స్థాయి ధరకు చేరుకోగా రిటైల్‌గా ఒక్క గుడ్డు 3.50 రూపాయలుగా అమ్ముతున్నారు. మాంసాహారంలో విపరీతంగా పెరిగింది కోడిమాంసమే. స్కిన్‌లెస్ కోడి మాంసం 145 రూపాయలైతే, పొట్టేలు మాంసంను కసాయిలు కిలో 300 రూపాయలు చేసిపారేశారు. చేపలు, రొయ్యల రేట్లు గతంలో ఎప్పుడూ లేనట్లు పెరిగిపోయాయి. గండి, బొచ్చె చేపలు కిలో 90 రూపాయలు పలుకుతుండగా, రొయ్యలు ఓ మోస్తరువి 250 రూపాయలైపోయాయి. పెరిగేరేట్లు, పెరగని ఆదాయాల మధ్య సామాన్య, మధ్యతరగతీయులు నలిగిపోతున్నారు. మూడు పూటల కడుపు నిండా తినలేని మాయదారి రోజులివి. దీనికి కారకులైన ప్రభుత్వాలను నిందించడం మినహా మరో మార్గం కానరావడం లేదు. సామాన్య, మధ్యతరగతీయులను ఇక ఆ దేవుడే కాపాడాలి.

# బారాషహీద్ దర్గాను బస్టాండ్ చేశారు!



దర్గా ఆవరణలో నిలిపి వున్న బస్సులు.

ఎంతో చరిత్ర గాంచిన నెల్లూరు బారాషహీద్ దర్గా చుట్టుప్రక్కల వున్న ఖాళీ స్థలాన్ని అధికారపార్టీకి చెందిన చోటా నాయకులు బస్టాండ్‌గా మార్చేశారు. నెలసరి ఐదు లక్షల మేర అక్రమార్జన చేస్తున్నా పట్టించుకొనేవారు లేకుండాపోయారు. బారాషహీద్ దర్గాకు రెండు ప్రవేశ మార్గాలున్నాయి. ఈ ప్రవేశ మార్గాల దగ్గర అడ్డంగా టోల్‌గేట్లు పెట్టేశారు. అధికారపార్టీతో సంబంధబాంధవ్యాలు కల్గిన షఫీ, మునాఫ్‌లు ఆర్టీసిలో కాంట్రాక్ట్ పద్ధతిన నడిచే బస్సులు రాత్రిపూట ఇక్కడ నిలుపుకొనేందుకు నెలసరి 850 రూపాయల లెక్కన వసూలు చేస్తున్నారు. ప్రతినిత్యం 40కిపైగా బస్సులు ఇక్కడ నిలుస్తున్నాయి. హైదరాబాద్ – నెల్లూరు మధ్య నడిచే ప్రైవేట్ సర్వీసులు 30కిపైగా పగటిపూట ఇక్కడ నిలబెట్టినందుకు ఒక్కో బస్సు దగ్గర 850 రూపాయలు వసూలు చేసుకొంటున్నారు. ప్రైవేట్ వ్యక్తులు టిప్పర్లు సైతం ఇక్కడ నిలిపి వుంచుతున్నారు. బాడుగలను బట్టి ఇవి బయటకు లోపలకు రాకపోకలు సాగిస్తున్నాయి. కొందరు ఆటోలను సైతం ఇక్కడ పెడుతున్నారు. డ్రైవర్లు, క్లీనర్లు దర్గా ప్రాంగణంలో చేరి మందు, విందులతో జల్సా చేస్తున్నారు. నానా ఛండాలపు పనులకు పాల్పడుతున్నారు. అసలు బారాషహీద్ దర్గా ప్రాంగణాన్ని ఈ చోటాలకు బస్టాండ్‌గా మార్చి బాడుగలకిచ్చే అధికారం ఎవరిచ్చారో అర్థమే కావడం లేదు.

దర్గా పరిసర ప్రాంతాల్లోని స్థలాన్ని సైతం షఫీ అండ్ బ్యాచ్ ఆక్రమించి షాపింగ్ కాంప్లెక్స్‌లు కట్టుకొని బాడుగలకు ఇచ్చేస్తున్నా అడిగేవారు లేకపోవడం విచారకరం. నెల్లూరు వక్ఫ్ ఇన్‌స్పెక్టర్ అంత పనికిమాలిన అధికారి ఇంకొకడు లేడు. మరీ ఇంతగా దోపిడీ చేస్తుంటే వక్ఫ్ శాఖకు నేతృత్వం వహించే డిఆర్వో ఏం చేస్తున్నట్లు?

# పిఆర్వోలుగా టీచర్లు!

బతకలేని వాడు బడిపంతులు అనేది గతంలో నానుడి. ఇప్పటి ఉపాధ్యాయులు మాత్రం బ్రతకనేర్చిన వారు బడిపంతుళ్లు అని రుజువు చేస్తున్నారు. పిల్లలకు విద్యాబుద్ధులు నేర్పి సమాజంలో వారిని ఉన్నతులుగా తీర్చిదిద్దాల్సిన బాధ్యతను ప్రక్కనపెట్టి సొంత వ్యాపారాల్లో మునిగిపోయిన సంగతి తెలిసిందే. ఉపాధ్యాయ వృత్తికే కళంకం తెచ్చేలా నేలబారుకి దిగజారి కార్పొరేట్, ప్రైవేట్ విద్యాసంస్థలకు తొత్తులుగా వ్యవహరిస్తూ బ్రోకర్ల అవతారమెత్తడం వారి దిగజారుడుతనాన్ని తెలియజెప్తున్నది. బీమా కంపెనీలకు ఏజంట్లుగా, వడ్డీ వ్యాపారులుగా, చెప్పుల అంగళ్లు, రెడీమేడ్ గార్మెంట్స్ వ్యాపారం చేస్తున్న అయ్యోర్లు ఇప్పుడు ప్రైవేటు విద్యా సంస్థల్లో పిల్లలను చేర్పించే పనిలో నిమగ్నం కావడం పవిత్రమైన ఆ వృత్తిని కళంకపరుస్తోంది. కార్పొరేట్ విద్యాసంస్థల యాజమాన్యాలు పాఠశాలలు తెరిచే సమయానికి విద్యార్థుల సంఖ్యను పెంచుకొనేందుకు పలువురిని దళారులుగా నియమించుకొని వారికి ఒక్క విద్యార్థిని చేర్పించినందుకు కమీషన్ ముట్టచెప్తుంటాయి. ప్రభుత్వ టీచర్లుగా వేలాది రూపాయలు జీతం తీసుకొంటూ తమ పాఠశాలల బాగుకోరాల్సిన ఉపాధ్యాయులకు ఈ పాడుపనులేమిటో?

### జిల్లావాసులను గత్తరపెట్టిన

# లైలా తుఫాన్!

**మూడురోజులపాటు జిల్లాపై తన ప్రభావం చూపిన లైలా తుఫాన్ మూలంగా విద్యుత్‌శాఖతోపాటు అరటి, నిమ్మ, మామిడి తోటలకు అపార నష్టం సంభవించింది.**



లైలా ధాటికి ఇనమడుగులో దెబ్బతిన్న అరటి తోట.

జిల్లాను మూడు రోజులపాటు "లైలా" తుఫాను అతలాకుతలం చేసింది. బంగాళాఖాతంలో ఏర్పడిన వాయుగుండం తుఫానుగా మారి ఈదురుగాలులు, వర్షాలు కురవడంతో ఆస్తి నష్టం సంభవించింది. జిల్లా అధికార యంత్రాంగం మొదటి నుంచి అప్రమత్తంగా వ్యవహరించి అన్ని జాగ్రత్తలు తీసుకోవడంతో ప్రాణ నష్టం తప్పింది. సముద్రతీర ప్రాంతాల్లోని గ్రామాల ప్రజలను పునరావాస కేంద్రాలకు తరలించారు. రెవిన్యూ, పోలీస్ శాఖలు ఈ దఫా సమన్వయంతో వ్యవహరించడం వల్ల ఇబ్బందులు ఏర్పడలేదు.

మూడు రోజులపాటు కురిసిన భారీవర్షాలు, ఈదురుగాలుల కారణంగా విద్యుత్‌శాఖతోపాటు ఉద్యానవన పంటలకు భారీనష్టం వాటిల్లింది. జిల్లాలో రెండవ పంట వేసుకునేందుకు రైతులు సన్నద్ధం అవుతున్న కారణంగా వరి పంటకు పెద్దగా నష్టాలు సంభవించలేదు. జిల్లాలో ఈదురుగాలుల కారణంగా విద్యుత్‌శాఖకు చెందిన 350 స్తంభాలు నేలకొరిగాయి. 342 ట్రాన్స్‌ఫార్మర్లు, 692 కండక్టర్లు దెబ్బ తిన్నాయి. దీంతో విద్యుత్ సరఫరాకు తీవ్ర అంతరాయం ఏర్పడడంతో మూడు రోజుల పాటు ప్రజలు ఇబ్బందులు పడాల్సి వచ్చింది. రాష్ట్ర ప్రభుత్వం అప్రమత్తంగా వ్యవహరించి విద్యుత్ సరఫరాకు ఆటంకం లేకుండా చూడాలని ఆదేశించినా స్పందన లేదు. తుఫాను గండం నుంచి గట్టెక్కిన రెండు రోజుల తర్వాత కూడా పలు మండలాల్లో విద్యుత్ సరఫరా చేయలేకపోయారు. జిల్లా కలెక్టర్, మంత్రి ఆనం రామనారాయణరెడ్డిలు సమీక్షా సమావేశాలు నిర్వహించిన సమయంలో రెండు రోజుల్లో అన్ని గ్రామాలకు విద్యుత్ సరఫరా చేస్తామని ప్రకటించిన ట్రాన్స్‌కో అధికారులు చేతులెత్తేశారు. కాలిపోయిన ట్రాన్స్ ఫార్మర్ల స్థానంలో కొత్తవాటిని ఏర్పాటు చేయమని మంత్రి చెప్పినా కేవలం మరమ్మత్తులు చేసేందుకే ఆ శాఖ అధికారులు చర్యలు చేపట్టారు. సిబ్బంది కొరత కారణంగా మరమ్మత్తులు చేపట్టలేక పోతున్నామని ట్రాన్స్‌కో అధికారులు అంటున్నారు.

## త్రాగునీటికి కటకట

విద్యుత్ సరఫరా లేకపోవడంతో త్రాగునీటికి తీవ్ర అంతరాయం కలిగింది. గ్రామీణ నీటి సరఫరా, మునిసిపాలిటీ అధికారులు వాటర్ ప్యాకెట్లను సరఫరా చేస్తామని ప్రకటించినా అది ఎక్కడా అమలు జరగలేదు. తీర ప్రాంతంలోని కావలి నుంచి తడ మండలం వరకు వున్న అన్ని గ్రామాలలో త్రాగునీటికి కటకటలాడాల్సి వచ్చింది. జిల్లాకు ప్రత్యేకాధికారిగా నియమితుడైన ఐఎఎస్ అధికారి అనంతరాము మొక్కుబడిగా తీరప్రాంత గ్రామాల్లో పర్యటించారు.

## దెబ్బతిన్న తోటలు

నెల్లూరు డివిజన్‌లోని ఇందుకూరుపేట, తోటపల్లి గూడూరు మండలాల్లో అరటి తోటలు బాగా దెబ్బతిన్నాయి. కోవూరు మండలంలోని ఆకు తోటలు, కూరగాయలకు నష్టం సంభవించింది. గూడూరు డివిజన్‌లో నిమ్మ తోటలు, కావలి డివిజన్‌లో మామిడితోటలకు అపార నష్టం జరిగింది. వ్యవసాయ శాఖకు, నీటిపారుదల శాఖలకు "లైలా" తుఫాను కారణంగా నష్టాలు జరగలేదు. సముద్రంపై ఆధారపడి జీవించే మత్స్యకారుల బోట్లు, వలలు కొంతమేర దెబ్బతిన్నాయి.

"లైలా" తుఫాను కారణంగా జిల్లాలో 14 కోట్ల రూపాయల మేర నష్టం సంభవించింది. నలుగురు మృత్యువాతపడ్డారు. తుఫానులో మరణించిన వారికి రాష్ట్ర ప్రభుత్వం రెండు లక్షల రూపాయల నష్ట పరిహారం చెల్లిస్తామని ప్రకటించింది. గ్రామీణ ప్రాంతాలలో 17 పునరావాస కేంద్రాలను ఏర్పాటు చేసి ఆరు వేల మంది బాధితులను తరలించారు. అలాగే జాతీయ విపత్తుల నివారణ సంస్థ నుంచి 30 మందితో కూడిన రెస్క్యూ బృందం తుఫాను సహాయక కార్యక్రమాలలో పాలుపంచుకుంది. తీర ప్రాంతాలలోని మండలాలకు ప్రత్యేక అధికారులుగా నియమించినవారు పర్యవేక్షణ చేయలేక పోయారు.

## పట్టణాల్లోనూ...

"లైలా" తుఫాను కారణంగా నెల్లూరు నగరంతోపాటు కావలి, గూడూరు, సూళ్లూరుపేట తదితర ప్రాంతాలలో జనజీవనం స్తంభించి పోయింది. విద్యుత్ సరఫరా నిలిచిపోవడంతో త్రాగునీటి సరఫరా చేయలేకపోయారు. త్రాగునీరు అందకపోవడంతో ప్రజలు అనేక ఇక్కట్లు ఎదుర్కోవాల్సి వచ్చింది. యుద్ధప్రాతిపదికన మరమ్మత్తులు చేపట్టి విద్యుత్ సరఫరా చేస్తామన్న అధికారులు పూర్తిగా విఫలం చెందారు. విద్యుత్ అంతరాయం కారణంగా త్రాగునీటి సరఫరా లేకపోవడంతో పట్టణ ప్రాంతవాసులు నరకయాతన అనుభవించాల్సి వచ్చింది.

## నష్టాలపై అంచనా

తుఫాను కారణంగా తీరప్రాంత మండలాల్లో సంభవించిన నష్టాలపై ఉద్యానవన శాఖ, వ్యవసాయ శాఖ, ట్రాన్స్‌కో అధికారులు అంచనాలు వేసేందుకు గ్రామీణ ప్రాంతాలలో సర్వే నిర్వహించారు. గతంలో మాదిరిగా కాకుండా ఈ దఫా పొలాలను సందర్శించి స్వయంగా పరిశీలన జరుపుతున్నారు. వ్యవసాయ శాఖకు సంబంధించి పెద్దగా నష్టం వాటిల్లలేదని ఆ శాఖ అధికారులు ముందుగా ప్రకటించినప్పటికీ గ్రామాలలో పర్యటించి పూర్తి నివేదికలు అందజేయాలని ప్రభుత్వం ఆదేశించింది. ఉద్యానవన శాఖకు 3183 హెక్టార్లలో పంట దెబ్బతిని దాదాపు తొమ్మిది కోట్ల రూపాయలకుపైగా నష్టం జరిగినట్లు ప్రాథమిక అంచనా.

రోడ్లు భవనాల శాఖకు సంబంధించి 500 కిలోమీటర్ల మేర రహదారులు దెబ్బతిన్నాయి. పంచాయితీరాజ్ శాఖకు సంబంధించి 400 కిలోమీటర్ల మేర రోడ్లు దెబ్బతిన్నాయి. తుఫాను కారణంగా ఏర్పడిన నష్టాలపై సర్వే జరిపి సమగ్ర నివేదిక అందిన తర్వాత నిధుల మంజూరు కోసం ప్రభుత్వానికి నివేదిస్తారు. జిల్లా కలెక్టర్ రాంగోపాల్, జిల్లా ఎస్పీ దామోదర్‌లు రెండు రోజుల పాటు కంటి మీద కునుకు లేకుండా ఎప్పటికప్పుడు మండలస్థాయి అధికారులకు సూచనలు, సలహాలు చేశారు. అయితే మండలస్థాయిలో విధులు నిర్వహించే సిబ్బంది, అధికారులు, ఇతర శాఖలకు చెందిన సిబ్బందితో సమన్వయం చేయలేక పోయారు.

ఈదురుగాలుల కారణంగా రహదారులపై చెట్లు అడ్డంగా పడిపోవడం వల్ల గ్రామీణ ప్రాంతాలకు కొన్ని బస్సులు వెళ్లలేకపోయాయి. అలాగే నేల కొరిగిన విద్యుత్ స్తంభాలను యదాస్థితికి చేర్చడంతో ఆ శాఖ అధికారులు వెంటనే చర్యలు చేపట్టలేకపోయారు. పొలాల మధ్యన ఒరిగివున్న స్తంభాల కారణంగా రైతులు ఆందోళన చెందుతున్నారు. ఈదురు గాలులకు తోడు పెద్దగా వర్షం లేకపోవడం వల్ల ఎక్కడా ఇళ్లు దెబ్బతినడంగాని, కూలిపోవడం కాని జరగకపోవడంతో ప్రజలు ఊపిరి పీల్చుకున్నారు.

# ఆత్మకూరులో నీటికి కటకట!

ఆత్మకూరు ప్రాంతంలో లైలా తుఫాను ప్రభావం స్వల్పంగానే వున్నప్పటికి విద్యుత్ సరఫరాలో అంతరాయం ప్రజలకు మంచినీటి సమస్యను ఉత్పన్నం చేసింది. వివిధ గ్రామాల ప్రజలు త్రాగునీటి కోసం దూరప్రాంతాలకు వెళ్లి నీటిని తెచ్చుకోవాల్సి వచ్చింది. లోతట్టు ప్రాంతాలన్నీ మురుగునీటితో నిండిపోయాయి. ఆత్మకూరు పట్టణంలో దాదాపు అన్ని ప్రాంతాల్లోను ఇదే పరిస్థితి నెలకొంది. ఈదురు గాలుల కారణంగా మండలంలోని రామస్వామిపల్లిలో రెండు విద్యుత్ స్తంభాలు, అరవీడు గ్రామంలో మరో రెండు స్తంభాలు కూలిపోయాయి. పట్టణంలో సోమశిల కూడలి వద్ద ప్రధాన రహదారిపై క్రొత్తగా అలుగువాగుపై నిర్మించిన కల్వర్టుకు ఇరువైపులా అప్రోచ్‌రోడ్డు

### కరెంటు లేక నానాపాట్లు

నిర్మాణం జరగకపోవడంతో ఈ ప్రాంతంలో పెద్ద గుంట ఏర్పడి వాహనాల రాకపోకలకు తీవ్ర అంతరాయం ఏర్పడింది. తుఫాను కారణంగా కురిసిన వర్షాల వలన మండలంలో పారిశుధ్యం పూర్తిగా క్షీణించింది.

# నీటమునిగిన నారుమళ్లు!

**తోటపల్లిగూడూరులో లైలాతో ఖేదం**

లైలా తుఫాను తోటపల్లిగూడూరు మండలంలోని రైతులకు తీవ్ర నష్టాన్ని కల్గించింది. వర్షంతోపాటు పెనుగాలులు వీయడంతో అరటి, మామిడి పంటలకు నష్టం వాటిల్లింది. పలు ప్రాంతాల్లో విద్యుత్ స్తంభాలు, వైర్లు తెగిపడడంతో 36గంటలపాటు మండలంలో అంధకారం అలుముకొంది. చెట్లు, స్తంభాలు కూలిపోవడంతో రాకపోకలకు అంతరాయం ఏర్పడింది. పలు గ్రామాల్లో 300 ఎకరాల్లో వేసిన నారుమడులు నీటిపాలయ్యాయి. మరో 50 ఎకరాల లేతపైర్లు ముంపునకు గురయ్యాయి. కోడూరు సముద్ర తీరంలో అలల ఉధృతి అధికంగా వుండడంతో ప్రజలు భయాందోళనకు గురయ్యారు. పండ్లతోటలకు 5లక్షల రూపాయల నష్టం వాటిల్లిందని రైతులు వాపోతున్నారు. విద్యుత్ సరఫరా నిలిచిపోవడంతో గ్రామాలకు గ్రామాలు తాగునీటి కోసం అల్లాడిపోయాయి. లోతట్టుప్రాంత ప్రజలను సురక్షిత ప్రాంతాలకు తరలించేందుకు మండల ప్రత్యేకాధికారి కమలకుమారి, తహశీల్దార్ లక్ష్మీనారాయణ చర్యలు చేపట్టారు. మండలంలో ఐదు సహాయ కేంద్రాలను ఏర్పాటుచేసి బాధితులను ఆదుకొన్నారు. మొత్తం మీద లైలా తుఫాను అటు రైతులను, ఇటు ప్రజలను తీవ్రంగా ఇబ్బందులకు గురిచేసింది.

## ముత్తుకూరులో చెరువుల ఆక్రమణ

ముత్తుకూరు మండలంలోని పలు గ్రామాల్లోని చెరువులు ఆక్రమణకు గురౌతున్నాయి. ఎవరికి వారు చెరువులను ఆక్రమించుకొంటున్నా సంబంధిత అధికారులు పట్టించుకోకపోవడంతో చెరువులు కుంచించుకొని పోతున్నాయి. ముత్తుకూరు పెద్దచెరువు 190 ఎకరాల విస్తీర్ణం. నేలటూరులోని చిన్నచెరువు 175 ఎకరాల్లో వుంది. ఈ చెరువుల్లో చాలా భాగం ఆక్రమించి వేశారు. మండలంలో దాదాపు 11 చెరువులది ఇదే పరిస్థితి. ఆక్రమణల కారణంగా చెరువుల్లో నీటి నిల్వలు తగ్గిపోతుండడంతో ఆయకట్టు క్రింద సాగు చేసుకొంటున్న రైతులు ఆందోళన చెందుతున్నారు. మరమ్మత్తులకు నోచుకోకపోవడంతో చెరువులు ఆక్రమణ చెరలో చిక్కి రూపు కోల్పోతున్నాయి. బహిరంగంగా చెరువు ఆక్రమణలకు గురౌతున్నా అధికారులు పట్టించుకోకపోవడంతో తమ పరిస్థితి అగమ్యగోచరంగా తయారైందని రైతులు వాపోతున్నారు.



# నిలచిన రైళ్లతో అగచాట్లు!

**కావలి రైల్వే స్టేషన్‌లో ప్రయాణీకుల పాట్లు**

తుఫాను ప్రభావంతో కురిసిన వర్షాల కారణంగా రైల్వేశాఖ రైళ్లను ముందు జాగ్రత్త చర్యగా నిలిపివేయడంతో కావలి స్టేషన్లో పలు రైళ్లు నిలిచిపోయాయి. ఒంగోలు ప్రాంతంలో ట్రాక్‌లపై నీళ్లు వచ్చి చేరడంతో రైళ్లకు బ్రేక్‌పడడంతో ప్రయాణీకులు తీవ్రంగా ఇబ్బందులు పడ్డారు. తిరుపతి – కాకినాడ, త్రివేండ్రం – ఢిల్లీ, తిరుపతి – హుబ్లీ రైళ్లు నిలిచిపోవడంతో ఆహారం, మంచినీటికోసం ప్రయాణీకులు నానా అగచాట్లు పడ్డారు. పసి పిల్లలయితే పాలు దొరక్క, ఆహార పదార్థాలు అందక అల్లాడిపోయారు. కొన్ని గంటలపాటు రైళ్లు నిలిచిపోవడంతో మధ్యాహ్నానికి వ్యాపారులు ప్రయాణీకులను నిలువు దోపిడీ చేశారు. ఉడికి ఉడకని పిడికెడు ఉప్మాను 20 రూపాయలని, పండ్లు అధిక ధరలకు విక్రయించడంతో విధిలేని పరిస్థితుల్లో ఎక్కువ ధరపెట్టి కొనుగోలు చేయాల్సిన పరిస్థితి ఏర్పడింది. ఆలస్యంగా ప్రయాణీకుల అవస్థలు తెలుసుకొన్న ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు సొంత నిధులతో పాలు, మజ్జిగ ప్యాకెట్లను అందజేయగా, సత్యసాయి సేవా సంస్థ, రెడ్‌క్రాస్, రోటరీక్లబ్ ప్రతినిధులు ఆహార పొట్లాలు, వాటర్‌ప్యాకెట్లు అందజేసి కొంతమేర ఆదుకొన్నారు. రైళ్లు నిలిపివేయడంతో ప్రయాణీకులు నరకయాతన అనుభవించాల్సి వచ్చింది.

## గూడూరులో గందరగోళం!

లైలా తుఫాను గూడూరు మండలంలో భీభత్సం సృష్టించింది. తీర ప్రాంత ప్రజలను అతలాకుతలం చేసింది. సరిగ్గా అర్ధరాత్రి తర్వాత మొదలైన భారీ వర్షాలకు పెనుగాలులు తోడవడంతో జనజీవనం స్తంభించిపోయింది. గాలుల ధాటికి గూడూరు పట్టణంలోని ఐసిఎస్‌రోడ్డు, మసీదువీధి, రాజావీధి, శివాలయంవీధి, జనార్దన్‌రెడ్డికాలని, నెహ్రూనగర్, బ్రాహ్మణవీధి, బనిగిసాహెబ్‌పేట, శాంతినగర్ ప్రాంతాలు జలమయం అయ్యాయి. వర్షం కారణంగా హోర్డింగులు, చెట్లు విరిగిపడడంతో రాకపోకలకు తీవ్ర అంతరాయం ఏర్పడింది. ఎస్‌ఎంజీ హైస్కూల్, జడ్పీ బాలుర పాఠశాల, మసీదువీధి, సొసైటీకాలనీ, జానకిరాంపేట, సత్రపువీధి ప్రాంతాలలో చెట్లు విరిగిపడ్డాయి. వ్యవసాయశాఖ, సబ్‌రిజిస్ట్రార్, ఈసేవా కేంద్రాల్లో నీరు నిలిచిపోయింది. డ్రైనేజీ వర్షపు నీటితో పొంగిపొర్లాయి. పెనుగాలులకు విద్యుత్, టెలిఫోన్ వైర్లు తెగిపోవడంతో చీకటి అలుముకోవడంతోపాటు సమాచార వ్యవస్థ చిన్నాభిన్నం అయ్యింది. పినాకిని, నవజీవన్, పూరి, మెమూ రైళ్లు ఆలస్యంగా నడిచాయి. నిమ్మ, సవక, మామిడి, జామాయిల్ చెట్లు నేలకూలాయి.

- మత్స్యకారుల

## గడపలు తాకిన సముద్రుడు!

తుఫాను భీభత్సం కారణంగా ఇందుకూరుపేట మండలంలోని పట్టపుపాళాలు జలదిగ్బంధంలో చిక్కుకున్నాయి. కొరుటూరు పట్టపుపాళెం, రాముడుపాళెం పట్టపుపాళాల్లో నీరు చేరడంతో ప్రజలు ఆందోళనకు గురయ్యారు. ఈ రెండు ప్రాంతాలకు రవాణా సౌకర్యం కూడా లేకపోవడంతో అధికారులు ట్రాక్టర్లు, ఎద్దులబండ్లలో గ్రామాలకు చేరుకొని సురక్షిత ప్రాంతాలకు తరలిరావాలని సూచించినా అందుకు వారు ఒప్పుకోకపోవడంతో అధికారులు మౌనంగా వెనుదిర

**రాముడుపాళెం, కొరుటూరులలో పరిస్థితిది!**

గాల్సి వచ్చింది. మైపాడు, కొల్లిమిట్టపాళెం, కొరుటూరు ప్రాంతాలలో 150 అడుగుల మేర సముద్రంలో జలాలు ముందుకు వచ్చాయి. జాలర్లు ముందు జాగ్రత్తగా వలలు, బోట్లను భద్రపరచడంతో ఎలాంటి నష్టం వాటిల్లలేదు. ఏకధాటిగా కురిసిన వర్షం, గాలుల ధాటికి ప్రజలు వణికిపోయారు. అయితే ఆర్డీవో వేణుగోపాలరెడ్డి, ఎంపిడివో చిరంజీవి ఎప్పటికప్పుడు అధికారులతో సమీక్షించి పరిస్థితిని పర్యవేక్షించడంతో ప్రమాదం తప్పింది.

# తెలుగుతమ్ముళ్ల మధ్య విభేదాలు!

- రాపూరులో పాడగిట్టని కురుగొండ్ల, పాపకన్ను వర్గాలు?

రాపూరు మండల తెలుగుదేశం పార్టీలో వర్గవిభేదాలు మరోమారు బట్టబయలయ్యాయి. మండలంలో పార్టీ రెండువర్గాలుగా విడిపోయి వుంది. ఒకటి ఎమ్మెల్యే కురుగొండ్ల వర్గంగా, మరొకటి పాపకన్ను వర్గంగా వుంది. మండల, గ్రామకమిటీలకు సంబంధించి ఎంపికలు జరగాల్సి వుండగా జిల్లా అధ్యక్షుడు సోమిరెడ్డి సమక్షంలోనే అవి జరగాలని రెండు వర్గాలు పట్టుబట్టడంతో నేతలు మిన్నకుండిపోవాల్సి వచ్చింది. ముందు స్థానిక తెలుగుగంగ అతిథిగృహంలో ఎమ్మెల్యే వర్గీయులు, పాపకన్ను అతిథిగృహంలో ఆయన వర్గం వారు సమావేశం ఏర్పాటు చేసుకున్నారు. అందరూ కలసి ఒకేచోట సమావేశం కావాలని అటు కురుగొండ్ల, ఇటు పాపకన్ను చెప్పినప్పటికీ రెండు వర్గాల వారు అందుకు ఒప్పుకోకపోవడంతో కమిటీల ఎంపిక వాయిదాపడింది. స్వయంగా రామకృష్ణ, పాపకన్ను అతిథిగృహానికి వెళ్లి అక్కడి వారిని సమావేశానికి రావాలని కోరినా ఫలితం లేకపోవడంతో ఆయన చేసేది లేక తిరుగుముఖం పట్టాల్సి వచ్చింది. ఇటీవల పార్టీలోకి క్రొత్తవారిని చేర్చుకోవడం, మండల నాయకత్వ మార్పు విషయంలో రెండువర్గాలకు విభేదాలు ఏర్పడినట్లు సమాచారం.



# DR. SRK. SCHOOL

**(Recognised by the Govt of A.P.)**
**Magunta Layout, Nellore - 524 003. Ph: 2325199**

ప్రతి విద్యార్థి ప్రగతే మా లక్ష్యం : : ప్రతిభగల ఉపాధ్యాయులు – విద్యార్థుల మేలి కలయిక

## SSC Results - 2010

| No. | Name | Tel | Hin | Eng | Mat | Sci | Soc | Tot | Per |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | N. Rajathushara | 97 | 96 | 86 | 99 | 97 | 98 | 573 | 95.50 |
| 2. | D. Venkata Yazushi | 94 | 92 | 91 | 100 | 98 | 98 | 573 | 95.50 |
| 3. | K.Sailakshmi | 96 | 94 | 83 | 100 | 99 | 97 | 569 | 94.83 |
| 4. | K.Yamini | 96 | 91 | 89 | 98 | 98 | 94 | 566 | 94.33 |
| 5. | V.Puneetha | 95 | 96 | 84 | 98 | 94 | 96 | 563 | 93.83 |
| 6. | P.Soumya | 97 | 82 | 84 | 100 | 99 | 100 | 562 | 93.67 |
| 7. | S. Pranavi | 91 | 95 | 85 | 100 | 94 | 95 | 560 | 93.33 |
| 8. | P. Sai Shasank | 95 | 94 | 80 | 96 | 98 | 97 | 560 | 93.33 |
| 9. | D. Bhavana | 98 | 84 | 87 | 98 | 95 | 97 | 559 | 93.17 |
| 10. | N. Sreemayusha | 94 | 84 | 88 | 100 | 97 | 96 | 559 | 93.17 |
| 11. | A. Varshith | 97 | 88 | 82 | 100 | 97 | 94 | 558 | 93.00 |
| 12. | R. L.K. Sarath Chandra | 95 | 96 | 78 | 99 | 96 | 94 | 558 | 93.00 |
| 13. | V.V.S. Praneeth | 96 | 90 | 77 | 100 | 97 | 96 | 556 | 92.67 |
| 14. | Ch. Sesha Sai Anirudh | 99 | 82 | 87 | 100 | 95 | 93 | 556 | 92.67 |
| 15. | D.V.S. Sujith Pavan | 96 | 92 | 75 | 100 | 97 | 96 | 556 | 92.67 |
| 16. | Shaik Nehatara | 91 | 96 | 78 | 99 | 95 | 95 | 554 | 92.33 |
| 17. | A. Jamimpranathi Priya | 94 | 93 | 81 | 97 | 96 | 93 | 554 | 92.33 |
| 18. | S.Venkata Charan | 87 | 94 | 80 | 99 | 98 | 95 | 553 | 92.17 |
| 19. | B. Venkata Praveen | 90 | 91 | 78 | 100 | 99 | 95 | 553 | 92.17 |
| 20. | M. Swetha Sri | 95 | 88 | 79 | 100 | 96 | 93 | 551 | 91.83 |
| 21. | SMD.Abdul Haseeb | 95 | 88 | 81 | 98 | 93 | 96 | 551 | 91.83 |
| 22. | R. Malavika | 94 | 93 | 70 | 100 | 98 | 95 | 550 | 91.67 |
| 23. | D. Srikanth Varma | 96 | 91 | 85 | 100 | 90 | 88 | 550 | 91.67 |
| 24. | M. Sahithi | 97 | 73 | 86 | 100 | 98 | 95 | 549 | 91.50 |
| 25. | M. Srikala | 92 | 96 | 80 | 99 | 89 | 92 | 548 | 91.33 |
| 26. | S. Shalini Swetha | 95 | 91 | 83 | 95 | 92 | 92 | 548 | 91.33 |
| 27. | Konduru Jyothsna | 96 | 88 | 81 | 100 | 91 | 90 | 546 | 91.00 |
| 28. | Korada Jyothsna | 90 | 82 | 85 | 99 | 96 | 94 | 546 | 91.00 |
| 29. | G. Sneha Madhuri | 97 | 89 | 85 | 100 | 82 | 92 | 545 | 90.83 |
| 30. | T. Naga Chandana | 96 | 88 | 81 | 95 | 96 | 89 | 545 | 90.83 |
| 31. | D. Yochana | 98 | 90 | 78 | 93 | 92 | 92 | 543 | 90.50 |
| 32. | N.V.S. Moukthika | 90 | 94 | 80 | 99 | 86 | 93 | 542 | 90.33 |
| 33. | V. Sravani | 87 | 90 | 74 | 98 | 96 | 96 | 541 | 90.17 |
| 34. | P. Kavya | 90 | 82 | 82 | 100 | 91 | 96 | 541 | 90.17 |
| 35. | T. Radha Krishna | 97 | 70 | 82 | 100 | 96 | 96 | 541 | 90.17 |
| 36. | S. Srimahathi | 93 | 80 | 82 | 98 | 91 | 96 | 540 | 90.00 |
| 37. | K. Hanisha | 95 | 95 | 70 | 97 | 88 | 95 | 540 | 90.00 |
| 38. | M. Yaswanth Kasyap | 89 | 89 | 79 | 100 | 92 | 91 | 540 | 90.00 |
| 39. | V. Padmini | 95 | 85 | 77 | 99 | 92 | 91 | 539 | 89.83 |
| 40. | Ch. Aravind | 96 | 85 | 79 | 93 | 96 | 90 | 539 | 89.83 |
| 41. | K. Bhargavi | 92 | 88 | 80 | 98 | 91 | 90 | 539 | 89.83 |
| 42. | V. Pravalika | 96 | 86 | 72 | 97 | 91 | 94 | 536 | 89.33 |
| 43. | A. Gayathri | 95 | 90 | 78 | 86 | 91 | 95 | 535 | 89.17 |
| 44. | B. Srinija | 95 | 88 | 75 | 100 | 94 | 83 | 535 | 89.17 |
| 45. | K. Mithilesh | 98 | 87 | 73 | 100 | 89 | 87 | 534 | 89.00 |
| 46. | Ch. Dev Akhil Reddy | 92 | 90 | 75 | 100 | 90 | 87 | 534 | 89.00 |
| 47. | M. Pragnesh | 92 | 85 | 81 | 98 | 85 | 92 | 533 | 88.83 |
| 48. | N. ManoharSai | 96 | 90 | 77 | 95 | 92 | 83 | 533 | 88.83 |
| 49. | Ch. Himaja | 96 | 79 | 73 | 100 | 96 | 88 | 532 | 88.67 |
| 50. | T. Sindhu | 83 | 89 | 81 | 98 | 92 | 87 | 530 | 88.33 |
| 51. | A. Sainandini | 96 | 88 | 73 | 96 | 83 | 94 | 530 | 88.33 |
| 52. | N. Mahitha | 96 | 80 | 83 | 99 | 83 | 89 | 530 | 88.33 |
| 53. | K. Sowbhagya Ravali | 96 | 76 | 82 | 97 | 91 | 87 | 529 | 88.17 |
| 54. | P. Bhavya Sri | 90 | 90 | 77 | 97 | 87 | 87 | 528 | 88.00 |
| 55. | N. Rahul Chowdary | 94 | 79 | 77 | 100 | 87 | 91 | 528 | 88.00 |
| 56. | B. Mohithraja Kumar | 92 | 83 | 78 | 97 | 90 | 87 | 527 | 87.83 |
| 57. | M. Sreedeepthi | 94 | 71 | 80 | 95 | 95 | 92 | 527 | 87.83 |
| 58. | M. Kanuga Priyanka | 95 | 90 | 76 | 91 | 90 | 85 | 527 | 87.83 |
| 59. | G. Naveen Kumar Reddy | 95 | 80 | 73 | 95 | 95 | 88 | 526 | 87.67 |
| 60. | W. V. M Pratheek | 84 | 77 | 84 | 99 | 91 | 91 | 526 | 87.67 |
| 61. | K. Sai Priyanka | 91 | 82 | 74 | 94 | 96 | 89 | 526 | 87.67 |
| 62. | R. Bhavana | 86 | 81 | 74 | 100 | 93 | 92 | 526 | 87.67 |
| 63. | V. Lakshmi Hari Shankar | 96 | 76 | 72 | 97 | 96 | 89 | 526 | 87.67 |
| 64. | K. Suresh Varma | 93 | 73 | 81 | 99 | 93 | 86 | 525 | 87.50 |
| 65. | M. N. Bharadwaj | 73 | 84 | 79 | 98 | 93 | 98 | 525 | 87.50 |
| 66. | K. Prasanth Reddy | 94 | 77 | 72 | 100 | 91 | 90 | 524 | 87.33 |
| 67. | Ch. Hari Charan | 88 | 80 | 81 | 100 | 86 | 89 | 524 | 87.33 |
| 68. | K. Malleswari | 85 | 81 | 80 | 97 | 93 | 88 | 524 | 87.33 |
| 69. | M. Vishnu Vardhan | 96 | 76 | 78 | 98 | 84 | 91 | 523 | 87.17 |
| 70. | J. Sai Subhankar | 84 | 86 | 72 | 98 | 92 | 90 | 522 | 87.00 |
| 71. | M. Kathyaini | 94 | 83 | 73 | 98 | 91 | 83 | 522 | 87.00 |
| 72. | M. V. Dushyanth Chowdary | 93 | 87 | 65 | 92 | 92 | 93 | 522 | 87.00 |
| 73. | K. Sreeiaasya | 94 | 89 | 62 | 95 | 92 | 90 | 522 | 87.00 |
| 74. | R.V. Mithilesh Reddy | 91 | 89 | 70 | 97 | 88 | 87 | 522 | 87.00 |
| 75. | G.K.V. Vishnu | 84 | 84 | 77 | 99 | 89 | 88 | 521 | 86.83 |
| 76. | V. Binny Thanmay | 92 | 83 | 76 | 96 | 85 | 89 | 521 | 86.83 |
| 77. | N. Sai Hemanth Kumar | 94 | 66 | 76 | 98 | 95 | 92 | 521 | 86.83 |
| 78. | K. Manvitha | 92 | 91 | 72 | 95 | 87 | 84 | 521 | 86.83 |
| 79. | V. Venkatesh | 94 | 91 | 68 | 87 | 92 | 88 | 520 | 86.67 |
| 80. | W. Adithya Varun | 93 | 86 | 68 | 96 | 87 | 90 | 520 | 86.67 |
| 81. | R. Pavana Swetha | 92 | 89 | 78 | 87 | 87 | 87 | 520 | 86.67 |
| 82. | P. Srinivas | 97 | 82 | 70 | 100 | 89 | 81 | 519 | 86.50 |
| 83. | Md. Jehangir Alam | 85 | 84 | 86 | 98 | 78 | 88 | 519 | 86.50 |
| 84. | P.V.Sai Srinivas | 95 | 85 | 72 | 99 | 84 | 83 | 518 | 86.33 |
| 85. | P. Subash Chandra | 97 | 85 | 63 | 98 | 90 | 85 | 518 | 86.33 |
| 86. | G. Mounika Kumari | 91 | 83 | 79 | 92 | 90 | 82 | 517 | 86.17 |
| 87. | T. Vishnu Swaroop | 93 | 76 | 77 | 99 | 79 | 92 | 516 | 86.00 |
| 88. | K. Aishwarya | 85 | 89 | 82 | 91 | 86 | 83 | 516 | 86.00 |
| 89. | P. Pavani | 89 | 95 | 67 | 89 | 90 | 86 | 516 | 86.00 |
| 90. | K. Rohin | 82 | 85 | 72 | 98 | 91 | 88 | 516 | 86.00 |
| 91. | P. Deepak | 90 | 86 | 66 | 93 | 90 | 90 | 515 | 85.83 |
| 92. | G. Charith | 92 | 92 | 79 | 91 | 84 | 77 | 515 | 85.83 |
| 93. | M. Charan Teja Yadav | 83 | 81 | 67 | 98 | 97 | 88 | 514 | 85.67 |
| 94. | Md. Apshan | 90 | 84 | 78 | 93 | 87 | 82 | 514 | 85.67 |
| 95. | N. Pavani | 92 | 79 | 74 | 97 | 81 | 89 | 512 | 85.33 |
| 96. | M. Sriharini | 96 | 89 | 68 | 88 | 80 | 90 | 511 | 85.17 |
| 97. | P. Venkata Sujan Kumar | 91 | 67 | 72 | 97 | 95 | 89 | 511 | 85.17 |
| 98. | T. Avanisimha | 83 | 89 | 74 | 98 | 74 | 92 | 510 | 85.00 |
| 99. | N. Sudeesh | 87 | 73 | 73 | 96 | 95 | 86 | 510 | 85.00 |
| 100. | D. Sai Siri Chandana | 91 | 71 | 75 | 91 | 94 | 87 | 509 | 84.83 |
| 101. | R. Lakshmidhar | 89 | 78 | 72 | 98 | 83 | 88 | 508 | 84.67 |
| 102. | Ch. Meghana | 90 | 86 | 85 | 97 | 68 | 82 | 508 | 84.67 |
| 103. | E. Bhavitha | 96 | 72 | 76 | 85 | 89 | 90 | 508 | 84.67 |
| 104. | Ch. Sai Praveen | 87 | 77 | 75 | 100 | 75 | 94 | 508 | 84.67 |
| 105. | Ch. P. L. Amulya | 92 | 85 | 69 | 93 | 86 | 82 | 507 | 84.50 |
| 106. | Shaik Hameed Ali | 87 | 61 | 74 | 97 | 93 | 95 | 507 | 84.50 |
| 107 | N. Rajitha | 86 | 83 | 74 | 93 | 83 | 88 | 507 | 84.50 |
| 108 | M. Mounica | 88 | 91 | 78 | 92 | 81 | 76 | 506 | 84.33 |
| 109 | A. Chaithanya Kumar | 79 | 74 | 75 | 100 | 87 | 90 | 505 | 84.17 |
| 110. | T. Vimalesh | 79 | 85 | 76 | 91 | 84 | 89 | 504 | 84.00 |
| 111. | G. Sudharani | 89 | 72 | 73 | 90 | 90 | 88 | 502 | 83.67 |
| 112. | K. Hari Priya | 89 | 79 | 78 | 95 | 75 | 84 | 500 | 83.33 |
| 113. | K. Venkata Sandeep | 75 | 91 | 76 | 95 | 81 | 82 | 500 | 83.33 |
| 114. | P. Lakshmi Manogna | 73 | 81 | 78 | 97 | 83 | 87 | 499 | 83.17 |
| 115. | T. Karthik Kumar Reddy | 85 | 88 | 57 | 88 | 87 | 93 | 498 | 83.00 |
| 116. | A.Sricheritha | 83 | 80 | 70 | 95 | 82 | 88 | 498 | 83.00 |
| 117. | B.Sirivaishnavi | 94 | 79 | 69 | 88 | 85 | 81 | 496 | 82.67 |
| 118. | Ch.Nikhila | 84 | 77 | 72 | 94 | 82 | 86 | 495 | 82.50 |
| 119. | K. Saiteja | 86 | 80 | 71 | 97 | 73 | 87 | 494 | 82.33 |
| 120. | T.C. Mathew | 75 | 95 | 80 | 76 | 87 | 81 | 494 | 82.33 |
| 121. | G.V.L.Mounika | 78 | 74 | 68 | 96 | 84 | 93 | 493 | 82.17 |
| 122. | Syed. Ayesha Banu | 93 | 83 | 78 | 90 | 77 | 72 | 493 | 82.17 |
| 123. | B. Penchala Manodhar | 76 | 74 | 76 | 92 | 87 | 88 | 493 | 82.17 |
| 124. | S. Swethusha | 86 | 79 | 85 | 84 | 75 | 83 | 492 | 82.00 |
| 125. | P. Reepikasree | 80 | 73 | 76 | 96 | 84 | 83 | 492 | 82.00 |
| 126. | B. Reshma | 90 | 85 | 69 | 87 | 78 | 82 | 491 | 81.83 |
| 127. | P. Revanth Kumar Reddy | 82 | 67 | 69 | 92 | 89 | 91 | 490 | 81.67 |
| 128. | G. Chiranjeevi | 85 | 67 | 72 | 92 | 88 | 84 | 488 | 81.33 |
| 129. | P. Gayathri Vijayalakshmi | 89 | 73 | 64 | 93 | 87 | 81 | 487 | 81.17 |
| 130. | M. Krishna Likhitha | 81 | 84 | 74 | 77 | 77 | 90 | 483 | 80.50 |
| 131. | V. S. Bhaskar Ram | 95 | 81 | 65 | 81 | 75 | 86 | 483 | 80.50 |
| 132. | M. Yeswanth | 82 | 81 | 73 | 88 | 73 | 86 | 483 | 80.50 |
| 133. | P. Naveen Reddy | 92 | 78 | 66 | 91 | 78 | 78 | 483 | 80.50 |
| 134. | Md. AtifSalam | 72 | 73 | 69 | 97 | 88 | 84 | 483 | 80.50 |
| 135. | K. Indrasena | 86 | 83 | 72 | 82 | 88 | 71 | 482 | 80.33 |
| 136. | Sd. Ashish Basha | 81 | 81 | 64 | 86 | 80 | 87 | 479 | 79.83 |
| 137. | B. Suhas | 82 | 76 | 69 | 92 | 84 | 76 | 479 | 79.83 |
| 138. | B. Priyanka | 80 | 86 | 72 | 85 | 76 | 74 | 473 | 78.83 |
| 139. | A. Sravan Reddy | 82 | 72 | 71 | 87 | 84 | 76 | 472 | 78.67 |
| 140. | R. Sai Swetha | 92 | 63 | 77 | 85 | 73 | 80 | 470 | 78.33 |
| 141. | Shaik Reshma | 84 | 76 | 69 | 81 | 73 | 85 | 468 | 78.00 |
| 142. | P. Vijaya Sree | 87 | 74 | 78 | 72 | 67 | 89 | 467 | 77.83 |
| 143. | V. Manikanta Teja | 97 | 67 | 60 | 87 | 67 | 85 | 463 | 77.17 |
| 144. | V. Srihitha | 88 | 81 | 74 | 81 | 56 | 82 | 462 | 77.00 |
| 145. | M. Lakshmi | 95 | 70 | 68 | 85 | 68 | 74 | 460 | 76.67 |
| 146. | P. Lakshmi Sai Varun | 83 | 50 | 69 | 86 | 87 | 83 | 458 | 76.33 |
| 147. | A. Ahvesh | 81 | 76 | 71 | 80 | 80 | 70 | 458 | 76.33 |
| 148. | R. Hanisha | 87 | 53 | 68 | 90 | 88 | 71 | 457 | 76.17 |
| 149. | M. Harish | 66 | 64 | 67 | 94 | 83 | 80 | 454 | 75.67 |
| 150. | R. Srinivasa Aditya | 80 | 85 | 62 | 60 | 84 | 81 | 452 | 75.33 |
| 151. | A. Akhila | 82 | 74 | 62 | 94 | 66 | 71 | 449 | 74.83 |
| 152. | M. Saivani | 76 | 58 | 82 | 86 | 69 | 77 | 448 | 74.67 |
| 153. | R. Srinivasulu Reddy | 72 | 52 | 54 | 92 | 90 | 83 | 443 | 73.83 |
| 154. | G. Kousar | 71 | 83 | 75 | 73 | 62 | 79 | 443 | 73.83 |
| 155. | A. Mustaq Ahamed | 82 | 79 | 63 | 88 | 52 | 74 | 438 | 73.00 |
| 156. | G. Sai Meghana | 91 | 64 | 75 | 86 | 46 | 75 | 437 | 72.83 |
| 157. | K. John Pradeep | 75 | 64 | 62 | 94 | 70 | 71 | 436 | 72.67 |
| 158. | P.Naga Chaitanya Kumar | 82 | 72 | 65 | 63 | 78 | 76 | 436 | 72.67 |
| 159. | K. Snehasai | 78 | 82 | 56 | 76 | 69 | 72 | 433 | 72.17 |
| 160. | G.V.S.Sai Akhilesh | 82 | 39 | 78 | 86 | 60 | 82 | 427 | 71.17 |
| 161. | N. Sravya Reddy | 70 | 71 | 71 | 80 | 66 | 68 | 426 | 71.00 |
| 162. | K. Venkat Sai | 85 | 42 | 79 | 93 | 49 | 75 | 423 | 70.50 |
| 163. | S.V.S. Sujitha Salini | 83 | 59 | 63 | 65 | 83 | 68 | 421 | 70.17 |
| 164. | Shaik Lai Ahamed | 66 | 76 | 60 | 66 | 70 | 75 | 413 | 68.83 |
| 165. | Ch. Venkata Naga Mounica | 72 | 57 | 63 | 85 | 66 | 69 | 412 | 68.67 |
| 166. | M. Venkata Dinesh Reddy | 61 | 67 | 68 | 74 | 73 | 65 | 408 | 68.00 |
| 167. | S. Mounika Devi | 67 | 63 | 74 | 75 | 70 | 59 | 408 | 68.00 |
| 168. | D. Navaneeth | 76 | 69 | 55 | 74 | 61 | 69 | 404 | 67.33 |
| 169. | K. Naveena Madhuri | 83 | 45 | 70 | 83 | 48 | 74 | 403 | 67.17 |
| 170. | M. Rithin | 77 | 62 | 65 | 88 | 63 | 58 | 403 | 67.17 |
| 171. | P. Lakshmikanth | 63 | 81 | 69 | 60 | 55 | 62 | 390 | 65.00 |
| 172. | S. Akhil Kumar | 85 | 42 | 63 | 71 | 59 | 66 | 386 | 64.33 |
| 173. | P. V. N. Surya Savarni | 59 | 52 | 65 | 79 | 51 | 66 | 372 | 62.00 |
| 174. | B. Pavana Sai Sudha | 51 | 55 | 61 | 58 | 59 | 71 | 355 | 59.17 |
| 175. | M. Phanivardhan | 50 | 58 | 63 | 69 | 55 | 54 | 349 | 58.17 |
| 176. | M. Sivakumar | 61 | 32 | 66 | 78 | 52 | 58 | 347 | 57.83 |
| 177. | U. Komal Chand | 41 | 52 | 70 | 48 | 54 | 60 | 325 | 54.17 |
| 178. | V. Pavan | 44 | 25 | 50 | 68 | 51 | 71 | 309 | 51.50 |
| 179. | Ch. Kamal Kumar | 48 | 22 | 48 | 54 | 59 | 75 | 306 | 51.00 |
| 180. | K. Madan Teja | 73 | 24 | 52 | 40 | 37 | 71 | 297 | 49.50 |

### Analysis

**500 and above Marks -133 Students**

100/100 in Maths-30; Social one

Grades A1→100; A2→40; B1→18; B2→10.

**Last Admission Test**
**4th and 7th June at 9a.m.**

**Smt M. Beulah Grace, B.Sc., B.Ed**
Head Mistress

**School Reopens on 7th June**

**P. Krishna Murthy M.Com.,**
Principal / Correspondent

# టెన్త్ ఫలితాల్లో రికార్డు నెలకొల్పిన నెల్లూరు విద్యార్థులు!

ఈ ఏడాది విడుదలైన పదవ తరగతి పరీక్షా ఫలితాల్లో జిల్లాలో సగటున 81శాతం ఉత్తీర్ణత లభించింది. గత సంవత్సరంతో పోలిస్తే 4శాతం పెరుగుదల కన్పించింది. ఉత్తీర్ణతలు సాధించడంలో కార్పొరేట్, ప్రైవేట్ విద్యా సంస్థలు పోటీలు పడ్డాయి. 30,420 మంది విద్యార్థులు పరీక్షకు హాజరు కాగా 24,640 మంది ఉత్తీర్ణులయ్యారు. ఫలితాల సాధనలో బాలురదే పైచేయి అయ్యింది. 15,614 మంది బాలురు, 14,806 మంది బాలికలు పరీక్షలు వ్రాయగా 12,717 మంది బాలురు, 11,923 మంది బాలికలు ఉత్తీర్ణత సాధించారు. 81శాతం ఉత్తీర్ణతతో జిల్లా రాష్ట్రంలో 12వ స్థానంలో నిలిచింది. గత సంవత్సరం 77.66 శాతంతో 15వ స్థానంలో ఉండగా ఈ ఏడాది ఫలితాల్లో పురోగతి సాధించింది. నారాయణ స్కూలు విద్యార్థిని గాయత్రిశర్మిష్ట 588 మార్కులు పొంది జిల్లా ఫస్ట్ వచ్చింది. ఉస్మాన్‌సాహెబ్‌పేటలోని రాఘవ టాలెంట్ స్కూలు విద్యార్థి సమంత్ 585 మార్కులతో జిల్లా సెకండ్, నారాయణ విద్యార్థిని నందిని తృతీయస్థానం సాధించింది. కార్పొరేట్ స్కూలు విద్యార్థులతో పోటీగా నగరంలోని భక్తవత్సలనగర్‌లో గల కెఎన్ఆర్ మున్సిపల్ కార్పొరేషన్ స్కూలు విద్యార్థి కె.సుధీర్ 582 మార్కులు సాధించి ప్రభుత్వ పాఠశాలల్లో చదువు సత్తాచాటాడు.

## మెరిసిన రత్నం

ఈ ఏడాది జరిగిన పదవతరగతి పరీక్షలకు సంబంధించి విడుదలైన ఫలితాల్లో రత్నం విద్యార్థులు మెరుగైన ఫలితాలు సాధించారు. హరనాథపురంలోని రత్నం స్కూలు విద్యార్థులైన బి.సాయి సంయుక్త 579, ఎస్.తేజశ్వి 579 మార్కులు సాధించారు. బి.సాయిశ్రావణ్ 578 మార్కులు పొంది జిల్లాస్థాయి ర్యాంకులు సంపాదించారు. 14 మంది విద్యార్థులు 570పైగా మార్కులు, 52మంది 560 పైన, 134 మంది 550పైగా మార్కులు సాధించారు. ఇదే స్ఫూర్తితో మున్ముందు మరింత ఉత్తమ ఫలితాలను సాధిస్తామని విద్యాసంస్థల డైరెక్టర్ వేణుగోపాల్ తెలిపారు.

సరస్వతినగర్‌లోని రత్నం స్కూల్ విద్యార్థులు మంచి మార్కులు సాధించారు. రోహిత్ 573 మార్కులు, విభ 571, అమూల్య 570 మార్కులు పొందారు. 560కిపైగా మార్కులను 17మంది విద్యార్థులు, 550పైగా మార్కులను 26మంది విద్యార్థులు, 500పైగా 54మంది సాధించారు. విలువలతో కూడిన విద్యను అందించడంలో తాము ఎల్లప్పుడూ ముందుంటామని అకడమిక్ హెడ్ డాక్టర్ కృష్ణకిషోర్ తెలిపారు.

## రవీంద్రభారతి విద్యార్థుల ప్రతిభ

రమేష్‌రెడ్డినగర్‌లోని రవీంద్రభారతి స్కూలు విద్యార్థులు టెన్త్‌క్లాస్ ఫలితాల్లో ప్రతిభ కనబరిచారు. ఎస్‌కె జైన్ 575 మార్కులు, టివి జ్యోతి 573, సంహితకృష్ణ 571 మార్కులు సాధించి ప్రథమ, ద్వితీయ, తృతీయ స్థానాల్లో నిలిచారు. మొత్తం 214 మంది విద్యార్థులకుగాను 132 మంది ఎ1గ్రేడ్, 16మంది విద్యార్థులు 560పైగా మార్కులు, 36 మంది విద్యార్థులు 550కిపైగా మార్కులు పొందారు. మ్యాథ్స్‌లో 53మంది 100కి 100 మార్కులు, 31మంది 99మార్కులు సాధించారు. సైన్స్ సబ్జెక్ట్‌లో 8 మంది విద్యార్థులు నూటికి నూరు మార్కులు సాధించి సంస్థ పేరు ప్రతిష్టలు ఇనుమడింపజేసినట్లు స్కూలు డైరెక్టర్ ఎంఎస్ మణి తెలిపారు.

## ఎస్ఆర్‌కెలో ఉత్తమ ఫలితాలు

మాగుంట లే-అవుట్‌లోని ఎస్ఆర్‌కె స్కూలు విద్యార్థులు ఈ ఏడాది పదవతరగతి ఫలితాల్లో ఉత్తమ ఫలితాలు సాధించారు. ఎన్.రాజతుషార 573 మార్కులు, డి.వెంకట యాజుషి 573, కె.శైలాక్షి 569 మార్కులు పొందారు. 113 మంది విద్యార్థులు 500కు పైగా మార్కులు సాధించగా, మ్యాథ్స్‌లో 30మంది, సోషల్‌లో ఒకరు నూటికి నూరు మార్కులను పొందారని స్కూలు కరస్పాండెంట్, గురుబ్రహ్మ అవార్డు గ్రహీత కృష్ణమూర్తి తెలిపారు. ఎ1గ్రేడ్‌ను 100 మంది, ఎ2 40మంది, బి1 18మంది, బి2 10మంది సాధించారన్నారు. ప్రతి విద్యార్థిపై వ్యక్తిగత శ్రద్ధ, ప్రతిభావంతులైన ఉపాధ్యాయుల శిక్షణ, ప్రణాళికాబద్ధమైన విద్యాబోధనతోనే ప్రతి ఏడాది మంచి ఫలితాలను సాధించగల్గుతున్నట్లు ఆయన తెలిపారు.

## వేదవ్యాస స్కూలు విద్యార్థుల ప్రతిభ

మాగుంట లే-అవుట్‌లోని వేదవ్యాస స్కూలు విద్యార్థులు మరోమారు పదవతరగతి పరీక్ష ఫలితాల్లో ఉత్తమ ఫలితాలు సాధించారు. అనుదీప్ 550 మార్కులు సాధించి ప్రథమస్థానంలో నిలిచాడు. పలువురు విద్యార్థులు ఎ1గ్రేడ్‌లో ఉత్తీర్ణత సాధించారని స్కూలు కరస్పాండెంట్ ఎపి.బాలాజి తెలిపారు. ఈ ఏడాది నుంచి ఎడ్యుక్యాంప్ స్మార్ట్ క్లాస్‌ల ద్వారా విద్యాబోధన చేయనున్నామని, విద్యార్థులు వివిధ అంశాలను సులభంగా అర్థం చేసుకొనేందుకు ఇది ఎంతగానో దోహద పడుతుందన్నారు.

## టెన్త్ ఫలితాల్లో నారాయణ ప్రభంజనం

పదవతరగతి ఫలితాల్లో నారాయణ స్కూలు విద్యార్థులు ప్రభంజనం సృష్టించారు. గాయత్రిశర్మిష్ట అనే విద్యార్థిని 588 మార్కులు సాధించి రాష్ట్రంలో 3వ స్థానాన్ని, జిల్లాలో ప్రథమ స్థానాన్ని పొందినట్లు స్కూలు అకడమిక్ జోనల్ ఇన్‌చార్జి డాక్టర్ విజయశేఖర్‌రెడ్డి తెలిపారు. నారాయణ స్కూలు నుంచి మొత్తం 485 మంది పరీక్షలకు హాజరుకాగా 283 మంది విద్యార్థులు 500కుపైగా మార్కులు పొందారన్నారు. విద్యార్థిని నందిని 583 మార్కులు, శశిధర్‌రావు 579, పవన్‌కళ్యాణ్ 577మార్కులు సాధించారని చెప్పారు. స్కూలు డైరెక్టర్ నారాయణ, ఉపాధ్యాయుల కృషి వలన ఇంతటి ఘన విజయాలను సాధించగలిగామన్నారు.

## విరబూసిన లిల్లీలిటిల్ ఫ్లవర్ స్కూలు

పదవ తరగతి పరీక్షా ఫలితాల్లో లిల్లీలిటిల్ ఫ్లవర్ స్కూలు (ఎల్ఎల్ఎఫ్) విద్యార్థులు చక్కని ఫలితాలు పొందారు. షేక్ షారూక్ 571 మార్కులు, కె.పెంచల నారాయణ 565, పి.రూప్‌సాయి కృష్ణారెడ్డి 565 మార్కులు సాధించినట్లు కరస్పాండెంట్ ఇపి.నారాయణరెడ్డి తెలిపారు. 550కుపైగా మార్కులను 5మంది, 500పైగా మార్కులను 30మంది పొందారన్నారు.

## నేతాజీ స్కూలులో చక్కని ఫలితాలు

విజయమహల్ సెంటర్‌లో గల నేతాజీ (ఎంఎస్ఆర్) పైలెట్‌స్కూలు విద్యార్థులు పదవ తరగతి పరీక్ష ఫలితాల్లో చక్కని ఫలితాలు సాధించారు. కె.సాయిసుదేష్ణలక్ష్మీ 573 మార్కులు, బి.జగదీష్ 571, డి.భావన 568 మార్కులు పొంది ప్రథమ, ద్వితీయ, తృతీయ స్థానాలను సాధించారని స్కూలు కరస్పాండెంట్ ఎం.సుబ్బారెడ్డి తెలిపారు. ఉన్నత ప్రమాణాలతో కూడిన విద్యను అందించడంతోపాటు పలు సేవా కార్యక్రమాల్లో విద్యార్థులను భాగస్వామ్యం చేయడంతో మంచి ఫలితాలను సాధించగల్గుతున్నట్లు వివరించారు.

## మైథిలిలో మెరుగైన ఫలితాలు

టెన్త్‌క్లాస్ పరీక్షా ఫలితాల్లో చంద్రమౌళినగర్‌లోని మైథిలిస్కూలు విద్యార్థులు మెరుగైన ఫలితాలు సాధించి స్కూలు పేరు ప్రతిష్టలు పెంచారు. ఎం.సుకన్య 569, ఎం.దివ్యజ్యోతి 566 మార్కులు, సివిఎన్ఎస్ గౌతమ్ 553 మార్కులు సాధించినట్లు కరస్పాండెంట్ బి.మనోహర్‌రెడ్డి తెలియజేశారు. 550పైగా మార్కులను ఐదు మంది, 500లకు పైగా మార్కులను 26 మంది సాధించారన్నారు. 40 మంది ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులైనట్లు చెప్పారు. మ్యాథ్స్, సైన్సులో 100కి 100, తెలుగులో 99 మార్కులు వచ్చాయని, 30 మందికి గణితంలో 100కి 90పైగా మార్కులు రావడం విశేషం అన్నారు.

## సత్యసాయి స్కూలు ఫలితాల్లో మెరుగు

నారాయణరెడ్డిపేటలో గల సత్యసాయి కాన్వెంట్ స్కూలు విద్యార్థి లీలావెంకయ్య పదవతరగతి పరీక్షా ఫలితాల్లో 570 మార్కులు సాధించాడు. అనుప్రియ 557 మార్కులు పొందింది. పాఠశాల నుంచి 40 మంది విద్యార్థులు పరీక్షలకు హాజరుకాగా 100 శాతం ఉత్తీర్ణత సాధించినట్లు కరస్పాండెంట్ హరగోపాల్ తెలిపారు. 27మంది విద్యార్థులకు 500కు పైగా మార్కులు వచ్చాయన్నారు.

## రాఘవ స్కూలు విద్యార్థుల ప్రతిభ

ఉస్మాన్ సాహెబ్‌పేటలోని రాఘవ టాలెంట్ స్కూలు విద్యార్థులు అత్యుత్తమ ఫలితాలు సాధించి స్కూలు కీర్తి ప్రతిష్టలను ఇనుమడింపజేశారు. సుమంత్ 585 మార్కులు పొంది రాష్ట్రస్థాయిలో 6వస్థానాన్ని, జిల్లాస్థాయిలో రెండవస్థానాన్ని సాధించారు. 1995లో 30మంది విద్యార్థులతో ప్రారంభమైన విద్యాసంస్థ అంచలంచెలుగా వృద్ధి సాధించి నేడు 900 మందితో రాఘవ టాలెంట్ స్కూలుగా విస్తృతమైందన్నారు. స్నేహబిందు 570మార్కులు, నవ్య 563 సాధించారని తెలిపారు.

## ప్రతిభ చూపిన శాంతినికేతన్ స్కూలు

కొండాయపాళెం గేట్ వద్దగల శాంతినికేతన్ స్కూలు విద్యార్థులు ఈ ఏడాది పదవతరగతి ఫలితాల్లో మంచి ఫలితాలు సాధించారు. ఎస్.సాయిప్రజ్ఞ 574 మార్కులు పొంది స్కూలు ఫస్ట్‌గా నిలిచింది. 30మంది 500కుపైగా మార్కులను, 10 మంది మ్యాథ్స్‌లో నూటికి నూరు మార్కులను, సైన్స్‌లో 99 మార్కులను నలుగురు విద్యార్థులు సాధించినట్లు స్కూలు కరస్పాండెంట్ మోసెస్ తెలిపారు.

## సంఘమిత్ర స్కూలులో మంచి ఫలితాలు

భక్తవత్సలనగర్‌లోని సంఘమిత్ర స్కూలు విద్యార్థులు ఈ సంవత్సరం పదవతరగతి పరీక్షా ఫలితాల్లో 100శాతం ఉత్తీర్ణత సాధించారు. పి.చైతన్య 569 మార్కులు, డి.ప్రత్యూష 560 మార్కులు, కె.సాయినిఖిత 558 మార్కులు సాధించారని కరస్పాండెంట్ కె.రవీంద్రరెడ్డి తెలియజేశారు. 550కుపైగా మార్కులను 6మంది, 500కుపైగా మార్కులను 26మంది, మ్యాథ్స్‌లో 100కి 90కిపైగా మార్కులు 43మంది సాధించినట్లు చెప్పారు.

## సాయివిద్యానికేతన్ స్కూల్‌లో మంచి ఫలితాలు

రామలింగాపురంలోని శ్రీసాయి విద్యానికేతన్ స్కూలు విద్యార్థులు పదవతరగతి ఫలితాల్లో మంచి మార్కులను పొందారు. కెపి.రమేష్‌బాబు 577 మార్కులు సాధించి ప్రథమస్థానంలో నిలిచినట్లు స్కూలు కరస్పాండెంట్ వి.పద్మావతి చౌదరి తెలిపారు. మ్యాథ్స్‌లో 100కి 100మార్కులను 20 మంది 95 మార్కులను 35మంది, సైన్స్‌లో 100కి 100 మార్కులను ఇద్దరు, 95 మార్కులు 22 మందికి వచ్చాయని చెప్పారు. నాణ్యమైన విద్యను అందిస్తుండంతో రాష్ట్రస్థాయి ర్యాంకులు సాధించగల్గుతున్నట్లు ఆమె తెలిపారు.

## అక్కడ మాత్రం వెలుగులు!



లైలా తుఫాను ప్రభావం నెల్లూరుపై పెద్దగా లేకపోయినా వందల సంఖ్యలో విద్యుత్ స్థంభాలు నేలకొరగగా అదే సంఖ్యలో ట్రాన్స్‌ఫారాలు పేలిపోయాయి. 18, 19, 20తేదీల్లో నెల్లూరు నగర ప్రజలు విద్యుత్ వెలుగులు లేక అంధకారంలో మగ్గాల్సి వచ్చింది. ముందుజాగ్రత్త చర్యగా కార్పొరేషన్ వాటర్ వర్క్స్ విభాగం వాటర్ ట్యాంకుల్లో నీటిని నిల్వ చేయక పోవడం వల్ల నగరంలోని లక్షలాది మంది జనం తాగునీరు, వాడునీరు లేక ఇక్కట్లు పడి పాత రోజులను గుర్తుకు తెచ్చుకొన్నారు. విద్యుత్ సౌకర్యం లేక జనం యిన్ని ఇబ్బందులు పడినా నెల్లూరు ఎసి సెంటర్‌లోని ఆనం వారి సందులో విద్యుత్ సరఫరా ఆగకుండా ట్రాన్స్‌కో అధికారులు చూశారు. ఇక్కడ రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి నివాసముంటారు. గాలివానలోనూ పొదలకూరురోడ్డులోని కలెక్టర్, ఎస్పీ బంగళాలకు నిరంతరాయంగా విద్యుత్ సౌకర్యం వుండింది. పెద్దల ఇళ్లకు మాత్రం వెలుగులు, సామాన్యులకు చిమ్మచీకట్లు. ఇదేమి న్యాయం?

## ఇడ్లీలు లేవు




లైలా తుఫాన్ మూలంగా నెల్లూరు నగరంలో మూడు రోజుల పాటు విద్యుత్ సౌకర్యం లేకపోవడంతో జనం టిఫిన్, భోజనం కోసం ట్రంకురోడ్డులోని హోటళ్లపై పడ్డారు. జనరేటర్ సౌకర్యం లేని హోటళ్ల నిర్వాహకులు టిఫిన్, భోజనాలు తయారు చేయలేకపోయారు. నెల్లూరు జనం ఉదయం టిఫిన్‌గా తినే ఇడ్లీలు గ్రైండర్లు పని చేయకపోవడంతో పెద్ద హోటళ్లు, హాట్‌ఫుడ్ సెంటర్లలోనూ పెట్టలేదు. దీంతో ఇడ్లీ ప్రియులు 'లైలా' తుఫానును నిందిస్తూ టిఫిన్ మానారు. క్షుద్బాధ తట్టుకోలేని వాళ్లు మాత్రం దోశెలు, పూరీలతో ఏదోలా సర్దుకొన్నారు.



## గ్లామర్ తగ్గని అనంతరామ్



లైలా తుఫాన్‌ను పురస్కరించుకొని నెల్లూరులో పరిస్థితుల పర్యవేక్షణకు సీనియర్ ఐఎఎస్ అధికారి అనంతరామ్‌ను రాష్ట్ర ప్రభుత్వం ప్రత్యేకాధికారిగా నియమించింది. ఇంతకుముందు నెల్లూరులో అనంతరామ్ కలెక్టర్‌గా పనిచేశారు. ఇస్త్రీ చొక్కా క్రాప్ రేగని అధికారిగా పేరుగాంచారు. ప్రత్యేకాధికారిగా విచ్చేసిన ఆయన 'గాలివాన' సమయంలో ఎక్కడా క్షేత్ర పరిశీలనకు వెళ్లలేదు. అధికారులకు గట్టి ఆదేశాలు జారీ చేయలేదు. తనదైన ఆనందలోకంలో సిగరెట్ తాగుతూ సుడుల్లో పొగ వదలుతూ కలెక్టరేట్‌లో కూర్చొన్నారు. తుఫాన్ తీరం దాటాక 21తేది సైట్ సీయింగ్‌గా ఆయన ఇప్పటి వరకు వెళ్లని కృష్ణపట్నం పోర్టుకు దాని పరిసర గ్రామాలకు వెళ్లివచ్చారు.

# వారఫలాలు

తేది 29-05-2010 నుండి 4-06-2010 వరకు మేషంలో బుధుడు; వృషభంలో రవి; మిథునంలో శుక్రుడు, కేతువు; సింహంలో కుజుడు; మీనంలో గురువు; కన్యలో శని; ధనుస్సులో రాహువు; వృశ్చిక, ధనుర్మకర, కుంభాల్లో చంద్రుడు సంచరిస్తారు.

**మేషం** (అశ్విని, భరణి, కృత్తిక 1 పా)

ఇరుగుపొరుగు వారి వల్ల ఉంటూవచ్చిన ఇబ్బందులు తొలగుతాయి. వృత్తి ఉద్యోగాలలో మంచి మార్పులు జరిగి విస్తరణ ప్రయత్నాలు చేస్తారు. రియల్‌ఎస్టేట్ వ్యవహారాలు లాభకరంగా ముగుస్తాయి. ఎదురుచూసిన చోట నుండి ఆదాయం చక్కగా లభిస్తుంది. ఇతరుల పనుల కోసం బాధ్యతలు స్వీకరిస్తారు. జామీను విషయంలో జాగ్రత్త. పుణ్యకార్యాలలో పాలు పంచుకొంటారు.

**వృషభం** (కృత్తిక 2,3,4 పా. రోహిణి, మృగశిర 1,2 పా)

వారాంతంలో ప్రత్యుత్పాదక అవయవాల బాధలుండవచ్చు. కుటుంబసభ్యులతో సఖ్యత తగ్గుతుంది. ఇతరుల జోలికి పోకుండడం మంచిది. ఆర్థికవిషయాలు కొంత తృప్తికరంగా ఉంటాయి. నూతన వృత్తికి సంబంధించి చేసే ప్రయత్నాలకు మంచివారి తోడ్పాటు లభిస్తుంది. రియల్ ఎస్టేట్ వ్యవహారాలు లాభకరంగా ముగుస్తాయి. విలువైన గృహోపకరణాలు కొంటారు.

**మిథునం** (మృగశిర 3,4 పా. ఆర్ద్ర,పునర్వసు,1,2,3 పా)

ఆర్థిక సమస్యలు ఎదురవుతాయి. కాని తృప్తికరంగా కాలం గడుస్తుంది. ప్రశాంతంగా కాలం గడపడం మంచిది. మానసిక వేదన, ఒత్తిడి కొంత తగ్గవచ్చు. స్పెక్యులేషన్ మంచిది కాదు. కుటుంబసభ్యులతో సఖ్యత తగ్గుతుంది. సంబంధం లేని విషయాల జోలికి పోకుండడం మంచిది. బంధుమిత్రుల పనుల కోసం శ్రమ తప్పదు. దాంపత్యసుఖం చక్కగా ఉంటుంది.

**కర్కాటకం** (పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష)

వసతిగృహ మార్పిడులకు అవకాశాలున్నాయి. స్పెక్యులేషన్ లాభిస్తుంది. సోదరులతో గొడవలు తొలగుతాయి. వ్యాపారంలో పోటీనెదుర్కొంటారు. కొత్త ఖాతాదారులు ఏర్పడే అవకాశం వుంది. రియల్ ఎస్టేట్ వ్యవహారాలు అనుకొన్న రీతిలో ఆదాయాన్నిస్తాయి. దొంగచాటు వ్యక్తుల ఎత్తుగడల్ని తిప్పి కొడతారు. సమాజంలో ప్రతిష్ఠగలవారి పరిచయం వల్ల భవిష్యత్తులో సత్ప్రయోజనాలనిస్తుంది.

**సింహం** (మఖ, పుబ్బ, ఉత్తర 1 పా)

ఎదురు చూసిన అవకాశాలు లభించే కాలం. నూతనోత్సాహంతో పనులు కొనసాగిస్తారు. బాంకు నిల్వలు పెంచే ప్రయత్నాలు చేస్తారు. ఉద్యోగులకు పలుకుబడి పెరుగుతుంది. అనుకూలసంభాషణలతో మీ పని సాధించుకొంటారు. పరోక్ష శత్రుత్వం దూరమవుతుంది. వృత్తి వాపారాభివృద్ధికోసం అప్పులు చేస్తారు. ఆరోగ్య విషయాలు మెరుగ్గా ఉంటాయి.

**కన్య** (ఉత్తర 2,3,4పా, హస్త, చిత్తా 1, 2 పా)

కుటుంబసభ్యులతో అనుకూలంగా నడుచుకోవాలి. మనశ్శాంతి ఉండవచ్చు. ఖర్చులు అధికం. కోరినవ్యక్తుల్ని కలుసుకొంటారు. ఆదాయం బాగుంటుంది. మానసిక విశ్రాంతి అవసరం. వృత్తిరీత్యా ఉత్సాహం, శ్రమ, ధనాదాయం అధికమవుతుంది. కళత్రసుఖం చక్కగా ఉంటుంది. పౌరసంబంధాలు బాగుంటాయి. బంధువుల నడుమ ప్రతిష్ఠ పెరిగే రీతిలో సాహస కృత్యాలు చేస్తారు.

**తుల** (చిత్తా 3, 4 పా. స్వాతి, విశాఖ 1, 2, 3 పా)

భాగస్వామ్యాలలో మంచి లాభావకాశాలు. రాజకీయాలలో పాలు పంచుకొంటారు. అప్పుతీర్చేందుకు కొత్త పథకాలు ఆలోచిస్తారు. కుటుంబంలో సఖ్యత కొరవడుతుంది. వృత్తిలో బదిలీలు మనసుకు సంతోషకరంగా ఉండవు. దైవకార్యాలలో పాలు పంచుకోవడం మంచిది. ఇష్టులకు అయిష్టదూర వార్తాశ్రవణం. మాతృసంబంధీకులతో ఏర్పడిన గొడవలు తొలగిపోతాయి.

**వృశ్చికం** (విశాఖ 4 పా, అనూరాధ, జ్యేష్ట)

ఇతరుల ఆలోచనలకై పరుగిడుతారు. భాగస్వామ్యాలలో మంచి లాభావకాశాలు. రాజకీయాలలో పాలు పంచుకొంటారు. ఋణబాధోపశమనానికి కొత్త పథకాలు ఆలోచిస్తారు. కుటుంబంలో సఖ్యత కొరవడుతుంది. సంఘంలో ప్రసిద్ధిచెందిన వారి సమాగమం మంచి భవిష్యత్తుకు పునాది వేస్తుంది. గొడవలు పడ్డ వారితో మరలా సత్సంబంధాలు నెలకొంటాయి.

**ధనస్సు** (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా)

నిలిచి నిదానంగా ఆలోచించి పనులు సాగించి మంచి ఫలితాల నందుకొంటారు. ఆదాయం, ఖర్చు సమానంగా ఉంటాయి. శ్రమకు తగ్గ ఫలితం దక్కుతుంది. బంధువులతో మనస్పర్ధలకు అవకాశం ఇవ్వవద్దు. సోదరుల మూలంగా శ్రమ, వివిధ మార్పులు జరిగే అవకాశాలున్నాయి. ఆరోగ్యవిషయంలో అతిజాగ్రత్త అవసరం. ఆర్థిక లావాదేవీలు మీకు అనుకూలంగా ఉంటాయి.

**మకరం** (ఉత్తరాషాఢ 2, 3,4 పా. శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)

మనశ్శాంతి తక్కువ. కుటుంబసభ్యులతో గొడవలు. ఊహించనిరీతిలో ధనవ్యయం అవుతుంది. సంతాన మూలకంగా ఇబ్బందులు. మాతృసంబంధీకుల తోడ్పాటు లభిస్తుంది. వివిధ మార్పులు జరిగే అవకాశాలున్నాయి. ఆరోగ్యవిషయంలో అతి జాగ్రత్త అవసరం. ఆర్థిక లావాదేవీలు మీకు అనుకూలంగా ఉంటాయి. వ్యాపారాలు భాగస్వాములతో జాగ్రత్తగా మెలగాలి.

**కుంభం** (ధనిష్ఠ 3,4 పా. శతభిషం, పూర్వ భాద్ర 1,2,3 పా)

ఇతరులపై మీదే పైచేయి. దూరం నుండి శుభవార్తాశ్రవణం. అప్పులు తీరుస్తారు. వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలో మంచి ఆదాయం. వినోదాలతో కాలక్షేపం చేస్తారు. విరక్తి నిస్సంగత్వం చోటు చేసుకొంటుంది. దైవసాయంతో చిన్న చిన్న ఆటంకాలను అధిగమిస్తారు. కళత్రసంబంధం చక్కగా ఉండకపోవచ్చు. వృత్తిలో అత్యధిక శ్రద్ధ అవసరం. దూరపు బంధువుల నుండి శుభవార్తాశ్రవణం.

**మీనం** (పూర్వాభాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి)

ఆహారవిషయంలో జాగ్రత్త అవసరం. అప్పులు తీర్చను ప్రయత్నాలు చేస్తారు. భాగస్వామ్యాలలో ఉంటూ వచ్చిన సమస్యలు తొలగిపోతాయి. కళత్ర సంబంధం చక్కగా ఉంటుంది. మాటలు జాగ్రత్తగా రానివ్వాలి. తగాదాల్లో విజయం మీదే. ఇష్టులైనవారి ద్వారా మీరు కోరుకొన్నవి సాధించుకొంటారు. సోదరులు సాయమందిస్తారు. తృప్తికరంగా దైవపూజాదులలో పాలు పంచుకొంటారు.

## పంచాంగం

### శుభ ముహూర్తాలు

29, 2 తేదీలలో వివాహాదులకు ఉ.3.00 గం.ల నుండి 5.00 వరకు మేషలగ్నాన.

30, 2తేదీలలో వివాహాదులకు ఉ.9.00 గం.ల నుండి 10.00 వరకు కర్కాటకలగ్నాన శుభముహూర్తాలున్నాయి.

### మే తిథులు

నిజ వైశాఖ బహుళ

| | | | |
|---|---|---|---|
| 29 శని | విదియ | తె.4.46 | గం.ల.వ |
| 30 ఆది | తదియ | పూర్తిగా | |
| 31 సోమ | తదియ | ఉ.5.50 | గం.ల.వ |

### జూన్ తిథులు

| | | | | |
|---|---|---|---|---|
| 1 | మంగళ | చవితి | ఉ.7.28 | గం.ల.వ |
| 2 | బుధ | పంచమి | ఉ.9.33 | గం.ల.వ |
| 3 | గురు | షష్ఠి | మ.11.56 | గం.ల.వ |
| 4 | శుక్ర | సప్తమి | మ.2.22 | గం.ల.వ |

పి.ఎం.గోపాలాచారి
16/1020, పొగతోట, నెల్లూరు – 1.
E-mail:maripmgg@yahoo.com

# జంతుబలి గృహ పురోభివృద్ధికి మంచిదికాదు!

## వాస్తు సందేహాలు సమాధానాలు

ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*పైడిమాకుల జగన్నాధశర్మ — చెన్నై*

** కొన్ని మతాల వారు గృహప్రవేశమప్పుడు 'జంతుబలి' ఇచ్చి దానితో డిన్నర్ ఇస్తారు.*

ఏ మత గ్రంథాలు కూడా 'జీవహింస' చెప్ప లేదు. అవన్నీ మిడిమిడి జ్ఞానంతో చేసేవే. అష్ట దిక్కుల నిమ్మ, టెంకాయి బలి, గర్భగృహంలోనూ, సింహద్వారం ముందు గుమ్మడికాయ బలిని గురించి ప్రాచీన హిందూ శాస్త్రాలు చెప్పాయి. జంతుబలి గృహపురోభివృద్ధికి అంత మంచిదికాదు.

*కె.శ్రావణిరెడ్డి — ఆత్మకూరు*

** దిక్ దోషాలున్నప్పుడు గమనించడం ఎట్లా?*

స్త్రీ సమస్యలున్నప్పుడు ఉత్తర, దక్షిణ స్థలాలలో, పురుష సమస్యలున్నప్పుడు తూర్పు పశ్చిమ స్థలాలలో దోషాలుంటాయి. వాటిని సరిచేసుకుంటే సరిపోతుంది.

*టి.రేణుకానాయుడు — చెన్నై*

** తూర్పు, ఉత్తరం స్థలాలే మంచివా? అవే కలిసి వస్తాయా?*

ప్లానులో చాలా వాస్తు దోషాలున్నాయి. వాస్తు దోషాలున్న స్థలం ఏ దిక్కు అయినా ఒకటే. తాత్కాలికంగా వాస్తు (ప్రథమార్థ) యంత్రప్రతిష్ఠ చేయండి. తర్వాత వాస్తును సరిదిద్దుకోండి.

*ఎం.లకుమారెడ్డి — చెన్నై*

** మాది విశాలమైన స్థలం. ఈ మధ్య అకారణంగా పిల్లలు పెద్దలు అనారోగ్యవంతులవుతున్నారు.*

స్థలంలోని ఎనిమిది దిక్కుల్లో 3x3 అడుగుల గుంతలు తీయండి. అందులో వెంట్రుకలు, ఎముకలు, పాత ఇటుకలు వుంటే తీసివేసి శంఖువు, 'నిమ్మ', పసుపు, కుంకుమ చల్లి తిరిగి పూడ్చివేసి శక్తి యంత్రప్రతిష్ఠ చేసుకోండి. ఫలితం వుంటుంది.

*ఎక్కసం శరత్‌బాబు — ఒంగోలు*

** మా యింట్లో తూర్పు, ఉత్తరాల్లో మామిడి, సపోటా చెట్లున్నాయి.*

విశాలమైన స్థలం వుంటే తూర్పు, ఉత్తరాల ప్రహరీకి 8-12 అడుగుల దూరంలో వృక్షాలుంటే ఈశాన్యానికి తగలకపోతే దోషం లేదు. తూర్పు, ఉత్తరాల్లో మొక్కలు వేయరాదు. వేశాక తీయరాదు.

*జె.డి.దివాకర్‌రెడ్డి — చిత్తూరు*

** దక్షిణం వీధి తూర్పు గృహాలు నిర్మించాము. ఆవిడకి ఆరోగ్యం బాగాలేదు.*

రాజవీధివైపే గృహ నిర్మాణాలు చేయాలి. ఇప్పుడు దక్షిణం వాస్తు ప్రహరీకి, స్థలానికి, గృహాలకు తూర్పు వాస్తు పాటించాలి. అంతా అస్తవ్యస్తంగా తయారవుతుంది. దక్షిణం స్త్రీలపై ప్రభావం చూపిస్తుంది.

*ఎం.రంగనాధదీక్షితులు — నెల్లూరు*

** నెల్లూరు రంగనాయకుల ఆలయం, పెన్నానది వల్ల ఆకర్షణ పెంచుకుందా?*

పూర్వం రంగనాథాలయం రెండు పాయల మధ్య వుండేది. ఆతర్వాత పెన్నా దిశ మార్చుకొని ఉత్తరపు పాయ అయ్యింది. ఆకర్షణ పెంచుకొంది. ఆగమ లోపాల వల్ల అధికారులు వివాదాస్పదమవుతారు.

*కె.వి.రత్నం — కావలి*

** యంత్ర ప్రతిష్ఠ తర్వాత చాలా సమస్యలు కుదుటపడ్డాయి.*

మంత్ర బీజాక్షరాలు గృహంలోని దుష్టశక్తులకు అడ్డుకట్టవేస్తాయి. గృహ సమతుల్యతను కాపాడుతాయి. ఫలితంగా సమస్యలు పరిష్కరింపబడుతాయి.

*పి.వి.రమణాచారి — సీతారామపురం*

** తూర్పు గృహం. ప్లాను, వ్యూఫోటో పంపిస్తున్నాను.*

వ్యూ ఫోటో వల్ల 'కోణవేధ' ఉన్నట్లు గుర్తించాను. ప్లానులో ఏడు లోపాలున్నాయి. మత్స్య యంత్ర ప్రతిష్ఠ చాలా మేలు చేస్తుంది.

*షేక్ షరీఫ్ — వెంకటగిరి*

** ఇల్లు మార్పులు, రీమోడల్ చేయాలనుకుంటున్నాను.*

నిర్మాణం ప్రారంభించే ముందు లక్ష్మీసహిత వాస్తు యంత్ర ప్రతిష్ఠ చేయండి. ఆటంకాలు లేకుండా గృహ నిర్మాణం జరుగుతుంది.



# రేపటికి ముందడుగువేస్తూ... నేటి ఘన విజయంతో చాటి చెపుతూ...
## ప్రతి విద్యార్థినీ విజేతగా నిలిపి భవిత వైపు నడిపిస్తుంది...

**రత్నం**

| Marks | Name | HT. No. |
|---|---|---|
| 579 | S. TEJASRI | 1017104804 |
| 578/600 | B. SAI SAMYUKTHA | 1017105660 |
| 578/600 | B. SAI SRAVAN | 1017103796 |
| 573/600 | M. LOHITHA | 1019121606 |
| 572/600 | A.D. SARATH KUMAR | 1017105250 |
| 572/600 | M. VASU NAIDU | 1017105244 |
| 572/600 | V.V. KARTHIKEY | 1017104673 |
| 571/600 | T. VIBHA | 1017107581 |
| 571/600 | G. GREESHMA | 1017105089 |
| 570/600 | L. AMULYA | 1017108555 |
| 570/600 | K. BHAVANA | 1017105053 |
| 570/600 | V. NAVEENA REDDY | 1017104723 |
| 570/600 | K. SAI MADHURI | 1017105616 |
| 570/600 | B. CHANIKYA NAIDU | 1017104442 |

## 560 పైన మార్కులు సాధించిన మా విద్యార్థులు

| Marks | Name | HT. No. |
|---|---|---|
| 569/600 | A. BALASREE SOWMYA | 1017104422 |
| 569/600 | B. SAVERI KRISHNA | 1017104737 |
| 569/600 | T. TEJASWINI | 1017108672 |
| 569/600 | B. PRANEETH SAI | 1017106239 |
| 569/600 | PUSHPAK TEJA | 1017102411 |
| 568/600 | P. HEMANTH | 1017107773 |
| 567/600 | D.V. SUMANTH | 1017105222 |
| 566/600 | V.B.S. SOURI | 1017107575 |
| 566/600 | V. NEELIMA | 1017104671 |
| 565/600 | S. BHARATH | 1017107571 |
| 565/600 | J. SAI AKHIL CHOWDARI | 1017101215 |
| 565/600 | PAVAN RAJU | 1019123006 |
| 565/600 | M. PALLAVI | 1019123251 |
| 565/600 | K. SAI TEJA | 1017111631 |
| 564/600 | A.V.S. BHARGAV | 1017108537 |
| 564/600 | B. SNEHA | 1017107911 |
| 564/600 | K. BHARGAV TEJA | 1017107915 |
| 564/600 | R. KEERTANA | 1017102373 |
| 564/600 | G. VIJAY ANUSHA | 1017111605 |
| 563/600 | T. UDAY KIRAN | 1017107268 |
| 563/600 | N. NIRUSHA | 1017108312 |
| 563/600 | D. SAI CHARAN | 1017106491 |
| 563/600 | B. SAI SOWJANYA | 1017107845 |
| 563/600 | R. NILAYA | 1017104228 |
| 563/600 | VARSHA JAIN | 1017103924 |
| 563/600 | M. SABITHA | 1017105701 |
| 562/600 | K.V. SUBASH YADAV | 1017107692 |
| 562/600 | M. SAI SRUTHI | 1017101733 |
| 562/600 | G. VARUN KUMAR | 1017111638 |
| 561/600 | Y. SPANDANA GEORGE | 1017107563 |
| 561/600 | N. SAI BHANU PRAKASH | 1017101261 |
| 561/600 | V. HIMASAI ASRITHA | 1017104222 |
| 561/600 | M. YASHASWEE REDDY | 1017105021 |
| 560/600 | CH. SAI LASYA PRIYA | 1017106455 |
| 560/600 | MD. FAIZUDDIN | 1017105006 |
| 560/600 | MEKALA VIJAY | 1017102625 |
| 560/600 | P. JAHNAVI | 1017105516 |
| 560/600 | M. SNEHA | 1017105604 |
| 560/600 | A. SAITEJA CHOWDARY | 1017105502 |

| ఫలితాల విశ్లేషణ | |
|---|---|
| 570 ఆపై మార్కులు సాధించినవారు | 014 |
| 560 ఆపై మార్కులు సాధించినవారు | 052 |
| 550 ఆపై మార్కులు సాధించినవారు | 134 |

| | |
|---|---|
| మాథ్స్‌లో 100కు 100 మార్కులు సాధించినవారు | 83 |
| సైన్స్‌లో 100కు 100 మార్కులు సాధించినవారు | 06 |
| తెలుగులో 100కు 100 మార్కులు సాధించినవారు | 01 |
| ఇంగ్లీష్‌లో 100కు 90 ఆపై మార్కులు సాధించినవారు | 14 |

**రత్నం జూనియర్ కాలేజ అడ్మిషన్లు జరుగుచున్నవి**

వివరములకు సంప్రదించండి

సెల్: 9160612304, 9160612324, 0861-2330065

**రత్నం ఐఐటి/హైస్కూల్ గూడూరు బ్రాంచి నందు అడ్మిషన్ల కొరకు సంప్రదించండి.**

సెల్: 9160612313, 9160612326.

# రత్నం స్కూల్స్ - నెల్లూరు

RATNAM HIGH SCHOOL

The Premier Schools for Medical & IIT-JEE Foundation

Play Class to 10th Class

డే-స్కూల్స్: 9703349595, 9246433550, 9246433683 రెసిడెన్షియల్: 9248048099, 9703349595 , 9246433683

## సింధు మీనన్‌కు పెళ్లి!

భద్రాచలం, సిద్ధం, చందమామ చిత్రాల్లో హీరోయిన్ సింధు మీనన్ త్వరలో పెళ్లికూతురు కాబోతుంది. లండన్‌లో స్థిరపడిన ప్రభును ఆమె పెళ్లి చేసుకోబోతుంది. ఈ విషయమై వివరిస్తూ నేను హఠాత్తుగా ఈ నిర్ణయం తీసుకోలేదు. ఎంబిఏ పూర్తయ్యాక పెళ్లి చేసేస్తామని పెద్దలు యేడాది నుంచి చెబుతూనే వున్నారు. పెళ్లాయ్యాక లండన్‌కు వెళ్లిపోతాను. కొన్నాళ్లు సంసారంలోని సరిగమలను ఆస్వాదిస్తాను. ప్రస్తుతానికి మాత్రం నటనకు బ్రేకు పడినట్లే. మరో రెండేళ్ల తర్వాత అవకాశం వస్తే నటిస్తాను. లేదంటే ఊరుకొంటానని తేల్చి చెప్పేసింది సింధుమీనన్.



## డబ్బే సర్వస్వం కాదు!



అందరి బంధువయ చిత్రంతో అందరినీ ఆకర్షించిన హీరోయిన్ పద్మప్రియ తమిళ, మళయాళ చిత్రాలతోపాటు స్ట్రైకర్‌తో బాలీవుడ్‌లోనూ నటించింది. తెలుగులో ఎక్కువగా ఎందుకు నటించడం లేదంటే కథలు నచ్చడం లేదంది. మసాలా సినిమాలంటే నాకిష్టమే. కాని డబ్బు సంపాదించడం నాధ్యేయం కాదు. ఏదో నాలుగేళ్లలో చేతికందినంత డబ్బును కూడ బెట్టుకొని వెళ్లిపోవాలన్నది నా అభిమతం కాదు. అందుకే మంచి పాత్రల్లో 60ఏళ్లు వచ్చినా నటిస్తూనే వుంటానంటుంది ఈ చిన్నది. దేశంలో ఇప్పటివరకు 500పైగా నృత్యప్రదర్శనలిచ్చిన పద్మప్రియ నృత్యప్రధానమైన పాత్రంటే ఇష్టమంటుంది. కాని ఎవరూ ఇంతవరకూ ఇటువంటి పాత్రతో తనను సంప్రదించలేదంది.

## ప్రేమించలేదు!



మగధీర చిత్ర విజయం తర్వాత హీరోయిన్ కాజల్‌కు డిమాండ్ పెరిగిపోయింది. ప్రతి యువహీరో, సీనియర్ హీరో ఆమెనే హీరోయిన్‌గా తన ప్రక్కన పెట్టమంటున్నారు. డార్లింగ్ చిత్రం తర్వాత ఆమె కాల్షీట్లు దొరకడం కాస్త కష్టంగానే వుంది. ఈ నేపథ్యంలో కాజల్ మాట్లాడుతూ ఒకట్రెండు సినిమాలు విజయవంతం కాగానే నేనేదో నెంబర్‌వన్ స్థానాన్ని పొందేశాననుకోవడం లేదు. అసలు ఈ నెంబరు గేమ్‌లపై నాకు నమ్మకమే లేదు. ఎవరినైన ప్రేమించారా అంటే; ప్రేమించడానికి, వివాహం చేసుకోవడానికి ఇంకా చాలా సమయం వుంది. ఇప్పుడే ఆ బంధంలో ఇరుక్కోను. నాకు ఇప్పటివరకు ఎదురుపడ్డ వాళ్లందరిలోనూ స్నేహితుడినే చూడగలిగాను. ప్రేమికుడిని, భాగస్వామిని చూడలేదంటుంది కాజల్.



## చిట్టిపొట్టి దుస్తులు తప్పవు!

జాతీయస్థాయిలో ఉత్తమనటి అవార్డు అందుకొన్నా ఎంతో ఒదిగి వుండే నటిగా ప్రియాంకా చోప్రాను పేర్కొనవచ్చు. ఆంగికం, ఆహార్యం విషయంలో ఆమె చాలా జాగ్రత్తలు తీసుకొంటుంది. స్టార్ హోదా ఇన్నాళ్లు ఎలా నిలబెట్టుకొన్నారంటే గ్లామర్‌తోనేనంటుంది. పరిశ్రమలో చిట్టిపొట్టి డ్రెస్‌లతో కనిపించక తప్పదు. మన బాహ్య సౌందర్యం కన్నా అంతర్లీనంగా వుండే ఆత్మ సౌందర్యాన్ని సంతృప్తి పర్చుకుంటే మనసుకు చాలా హాయిగా వుంటుంది. మరీ ఎబ్బెట్టుగా దుస్తులు ధరించమంటే నిర్మాత, దర్శకులకు ఇబ్బందులు వివరించి వారిని తన దారికి తీసుకొస్తానంటుంది ఈ సుందరి.

## నాకు దేవాలయాలొద్దు!



తమ అభిమాననాయకులు, నాయకిల ఫోటోల ముందు కర్పూర హారతులు వెలిగించడం, గజమాలలు సమర్పించడం, ఇంకాస్త ముందుకెళ్లి గుళ్లు, గోపురాలు కడుతుంటారు. తమిళనాడులో ఈ ధోరణి మరికాస్త ఎక్కువ. ఈ మధ్య తమన్నా హీరోయిన్‌గా నటించిన తమిళ చిత్రం పయ్యా విడుదలయ్యింది. అంతే అభిమానులు థియేటర్ల ముందు పాలాభిషేకాలు, హారతులు, టెంకాయలు కొట్టడాలు ప్రారంభించారు. ఇంకొందరు ఆమె గుడి కట్టడానికి అనువైన స్థలం కోసం అన్వేషణ ఆరంభించారు. ఈ విషయాలు తెలిసిన తమన్నా అభిమానులను సున్నితంగానే కట్టడి చేసింది. క్షీరాభిషేకాలు చేయించుకోను నేను దేవతను కాదు. మామూలు మనిషినని చెప్పడంతో ఆమె అభిమానులు నీరుగారి పోయారు.



## ఓ మోస్తరుగా 'ఆవారా'

✍ అల్లూరు రహీం

చిత్ర సమీక్ష

తమిళంలో 'పయ్యా' పేరిట విడుదలై విజయవంతమైన చిత్రానికి తెలుగుసేతనే ఆవారా. ఈ చిత్రాన్ని స్టూడియో గ్రీన్ సంస్థ నిర్మించింది. ఈ చిత్రం షూటింగ్ నాయుడుపేట జాతీయ రహదారిపై ఎక్కువ భాగం జరిగింది. వాస్తవానికి ఈ చిత్ర కథంతా హీరో, హీరోయిన్లు బెంగుళూరు నుంచి ముంబాయికి సాగించే కారు ప్రయాణంపైనే ఆధారపడి వుంటుంది. రెండు గంటల ఇరవై నిమిషాల ఈ సినిమాలో స్క్రీన్‌ప్లే బిగువు, హీరోయిన్ అందచందాల ప్రదర్శన, హీరో వీరోచిత పోరాటాల నడుమ దర్శకుడు లింగుస్వామి లాక్కొచ్చేస్తాడు. ఇవి మినహా చిత్రంలో చెప్పుకోతగ్గ విషయం లేదు. కాని చిత్రం చూస్తున్న ప్రేక్షకులకు ఎక్కడా విసుగనిపించదు. తొలిచూపులోనే ప్రేమ పుడుతుందనే దానికి హీరో కార్తికి హీరోయిన్ తమన్నా బస్టాపులో విచిత్రంగా తారసపడడం, అది షాపింగ్‌మాల్, రైల్వేస్టేషన్, విమానాశ్రయాల వరకు కొనసాగించిన తీరు బాగుంది. తాను మెచ్చిన నెచ్చెలితో కారు ప్రయాణపు అనుభూతులను హీరో మిత్రులతో పంచుకొనే తీరు, మార్గమధ్యంలో హీరో, హీరోయిన్లను పట్టుకెళ్లను రెండు గ్రూపుల ఛేజింగులు ప్రేక్షకుల్లో ఉత్సుకతను రేపుతాయి. అదిరేవాన పాటలో హీరోయిన్ తమన్నా అందాలను కెమెరామెన్ మది హద్దులు దాటకుండా తెలివిగా చూపాడు. సినిమాలోని ఒక సన్నివేశంలో హోగనేకల్ జలపాతం అందాలు, మరోచోట చీకట్లో కారు చేజింగుల చిత్రీకరణలో కెమెరామెన్ పనితీరు మెచ్చుకోవాల్సిందే. యువన్‌శంకర్ రాజా సంగీతంలో పసలేదు. నెల్లూరీయుడు, మాటల రచయిత శశాంక్ వెన్నెలకంటి ఈ చిత్రంలో మాటలను సినిమా కోసమని కాకుండా మామూలు మాటల ధోరణి కొనసాగించాడు. రెండు మూడు సార్లు ఆయన సినిమాలో 'నెల్లూరు' పేరు ప్రస్తావనకు తెస్తాడు. యుగానికొక్కడు ఫేం కార్తి బాడీ లాంగ్వేజ్‌కు తగ్గట్టుగా, హీరోయిన్ తమన్నాను యువకులను ఆకర్షించేవిధంగా చూపడంలో కథకుడు, స్క్రీన్‌ప్లేతోపాటు దర్శకత్వం వహించిన లింగుస్వామి పాస్ మార్కులు సాధించాడని చెప్పకతప్పదు.

ఇక చిత్రకథలోనికి వెళ్తే శివ(కార్తి) మొండిఘటం. బాగా చదువుకొని ఉద్యోగం కోసం వెళ్లాల్సిన ఇంటర్వ్యూలకు హాజరుకాడు. మిత్రులు పట్టుపట్టి ఓ ఇంటర్వ్యూకు తీసుకవెళ్తే అక్కడ చారులత (తమన్నా)ను చూసి ఆమె వెనుకనే వచ్చేస్తాడు. శివ గ్యాంగ్ ఉపయోగించుకోను వారి బంధువు ఒకరు కారు ఇచ్చి ఉంటారు. ఆయన్ను రైల్వేస్టేషన్ నుంచి తీసుకురాను వెళ్లిన శివకు మరో వ్యక్తితో చారులత తారసపడుతుంది. వాళ్లు అర్జెంటుగా నెల్లూరు వెళ్లాలని కోరడంతో తాను వచ్చిన పని మరచిన శివ వారిని తాను తీసుకవెళ్లిన కారులో ఎక్కించుకొంటాడు. పెట్రోల్ బంకు దగ్గర కారు ఆగివుండే సమయంలో చారులత తనతో వున్న వ్యక్తి నుంచి తప్పించమని శివను కోరుతుంది. విమానాశ్రయం, రైల్వేస్టేషన్లలో ఆమె ముంబాయి వెళ్లాల్సిన విమానం, ట్రైన్లు మిస్ అవుతాయి. దీంతో శివను టాక్సీ డ్రైవర్‌గానే భావించి తనను బెంగుళూరు నుంచి ముంబాయి తీసుకెళ్లమంటుంది. మార్గమధ్యమంలో తనకు బలవంతంగా తన తండ్రి పెళ్లి చేయాలని తలపోసినట్లు చెబుతుంది. చారులత కోసం ఆమె వెనకాలే ఓ గ్యాంగ్ వస్తుంది. కారు ప్రయాణంలో శివ, చారులత మధ్య కాస్త కెమిస్ట్రీ జరుగుతుంది. కాని ఇద్దరు ఒకరి మనసులో మాటను ఒకరు వెళ్లడించుకోరు. వీరి ప్రయాణంలో శివను చంపను ఒక ముఠా వస్తుంది. గతంలో శివ ఒకసారి ముంబాయికి వెళ్లినప్పుడు అక్కడి అండర్ వరల్డ్ గ్యాంగ్‌లీడర్ బాలు(మిలింద్ సోమన్)తో గొడవపడడంతో వాళ్లు కారులో అతన్ని చూసి వెనుకపడతారు. ఎట్టకేలకు శివ చారులతను ముంబాయిలోని వారి అమ్మమ్మ ఇంట్లో దిగబెడతాడు. ఈ సందర్భంగా ఆ కుటుంబంలో జరిగే గొడవలో తన తల్లిని ఆమె మామలు నిందించడంతో చారులత అక్కడ నుంచి వెనుతిరుగుతుంది. శివ, చారులత స్మృతుల్లో ఒకచోట కారును నిలుపుకొని వుండగా అక్కడకు ఆమె చేరుకొంటుంది. ఇంతలో వీరిద్దరి కోసం వెతికే గ్యాంగులు చేరుకొంటాయి. భారీ ఘర్షణ అనంతరం శివ వారిని మట్టి కరిపిస్తాడు. చారులత చేయి పట్టుకొని ముందుకు సాగే సమయంలో ఆమె శివను హత్తుకొని 'ఐలవ్‌యు' చెప్పడంతో చిత్రం ముగుస్తుంది.

# మైనార్టీలను మోసం చేస్తున్న రాజకీయ పార్టీలు!


ప్రతి ఎన్నికలోనూ కరివేపాకులే...

నెల్లూరులో కార్పొరేషన్ ఎన్నికల సందడి మొదలయ్యింది. రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి అందరికంటే ముందుగా 12వ డివిజన్‌లో కర్తం ప్రతాప్‌రెడ్డి కాంగ్రెస్ తరఫున కార్పొరేటర్‌గా పోటీ చేస్తారని ప్రకటించారు. రాజీవ్‌భవన్ తాను పోటీ చేయించాలనుకొంటున్న అభ్యర్థుల జాబితాను తయారు చేసుకొంటుంది. తెలుగుదేశం పార్టీ జిల్లా అధ్యక్ష ఎన్నికల నిర్వహణ పూర్తయ్యాక ఈ ఎన్నికలపై దృష్టి పెట్టేటట్లుంది. సిపిఎం కూడా పోటీ చేయాల్సిన స్థానాలపై ఒక అభిప్రాయానికి వచ్చింది. అన్ని పార్టీలు రకరకాల వ్యూహాల్లో నిమగ్నమై వున్నా నెల్లూరు నగరంలో అతిపెద్ద ఓటు బ్యాంకుగా వున్న మైనార్టీలను ఎన్నికల సమయంలో ఏదోరకంగా దువ్వి తమదారికి తెచ్చుకొంటున్నాయి మినహా వారికి పార్టీ టిక్కెట్లు ఇచ్చి ఎన్నికల్లో పోటీ చేయించడమే లేదు. మైనార్టీ నాయకుల మధ్య విభేదాలు సైతం రాజకీయపార్టీలు తమకు అనుకూలంగా మలచుకొంటున్నాయి.

1947 నుంచి 1960 వరకు ఎపి సుబ్బారెడ్డి మునిసిపల్ ఛైర్మన్‌గా పనిచేశారు. ఆ తర్వాత 1960 నుంచి 1962 వరకు సౌదాగర్ మహబూబ్‌ఖాన్‌కు మునిసిపల్ ఛైర్మన్‌గా వ్యవహరించే అవకాశం దక్కింది. ఆ తర్వాత గడచిన 50ఏళ్లలో మైనార్టీల ఓట్లు 75వేలు దాటినా వారికి పల్లకి మోసే భాగ్యం తప్ప ఎక్కే భాగ్యం దొరకలేదు. 1967 ప్రాంతంలో ఆనం వెంకటరెడ్డి మునిసిపల్ ఛైర్మన్‌గా వున్నప్పుడు లంగర్ చుట్టల కంపెనీ యజమాని హైదర్ సాహెబ్‌కు మునిసిపల్ వైస్‌ఛైర్మన్‌గా అవకాశమిచ్చారు. 1999 ఎన్నికల్లో ఆదాల ప్రభాకర్‌రెడ్డి చొరవ తీసుకొని టిడిపి పక్షాన మైనార్టీ బాషను వైస్‌ఛైర్మన్‌గా నిలబెట్టడంతో ఆయనకు పోటీగా ఆనం సోదరులు సందాని బాషను రంగంలోకి దింపి గెలిపించారు. నెల్లూరు కార్పొరేషన్ అయ్యాక జరిగిన ఎన్నికల్లో కాంగ్రెస్‌పార్టీ తరఫున ఒక మైనార్టీ కూడా గెలవకుండా వివేకానందరెడ్డి ప్రతి డివిజన్‌లో పోటీ అభ్యర్థులను నిలబెట్టి ఓడించారు. ప్రస్తుతం కార్పొరేషన్‌లో వున్న మైనార్టీ కార్పొరేటర్లు సందానిబాష, జరీనా, మునాఫ్‌లు స్వతంత్రులుగా గెలిచాక తిరిగి వారిని అక్కున చేర్చుకొన్నారు. 1967 ప్రాంతంలో మాత్రం మైనార్టీలు ఆరు మంది కౌన్సిలర్లుగా పని చేశారు. ఆ తర్వాత అటువంటి అవకాశమే రాలేదు. ఈసారి కార్పొరేషన్ ఎన్నికల్లో సైతం మైనార్టీలను కరివేపాకులుగా కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీలు వాడుతాయా లేక టిక్కెట్లు ఇచ్చి అందలమెక్కి స్తాయా అన్నది మరో మూడు నెలలు వేచిచూడాల్సిందే!

# పలకని సెల్‌ఫోన్లు!

సెల్‌ఫోన్‌ల చార్జింగ్ లేక సమాచార సంబంధాలు తెగిపోవడంతో ఫోన్ వినియోగదారులు ఇబ్బందులు పడ్డ తీరు సెల్‌ఫోన్ ఎంతగా మానవ జీవితాలలో పెనవేసుకొన్నది ప్రస్ఫుటమయ్యింది. లైలా తుఫాను కారణంగా జిల్లాలో విద్యుత్ సరఫరాకు ఆటంకమేర్పడడంతో మూడు రోజులుపైగా అంధకారం అలుముకొంది. కరెంటు లేకపోవడంతో త్రాగునీటికి, ఇతరత్రా అవసరాల కోసం ప్రజలు పలు ఇబ్బందులు పడ్డారు. దీనికంటే అధికంగానే సెల్‌ఫోన్‌లు చార్జి చేసుకొనేందుకు అగచాట్లు పడ్డారు. విద్యుత్ సౌకర్యం లేకపోవడంతో జిల్లావ్యాప్తంగా సెల్‌ఫోన్‌ల వినియోగదారులు తమ ఫోన్లను చార్జింగ్ చేసుకోను సౌకర్యం లేక అధిక సంఖ్యాకుల సెల్‌ఫోన్లు మూగబోయాయి. కొందరు కార్లు వుండేవాళ్లు మాత్రం అందులో ఫోన్లు చార్జి చేసుకోగా, మరికొందరు కంప్యూటర్లకు వుండే యూపిఎస్‌ల ద్వారా కొంతమేర చార్జి చేసుకోగలిగారు. మిగతావాళ్లకు ఈ సౌకర్యం లేకపోవడంతో ప్రపంచంతో సంబంధాలు తెగిపోయినట్లు ఒకవిధమైన మానసిక ఆందోళనకు గురయ్యారు. నగరంలో కొందరు యువకులు రైల్వేస్టేషన్లకు పరుగులు తీసి అక్కడ సెల్ ఛార్జింగ్ చేసుకొన్నారు. రైల్వేశాఖకు ప్రత్యేక విద్యుత్ సరఫరా వుండడంతో ఆయా స్టేషన్లలో మాత్రం విద్యుత్ కాంతులు వుండగా, మిగతా అన్నిచోట్లా అంధకారమే రాజ్యమేలింది. విద్యుత్ సరఫరా పునరుద్ధరించేవరకు సెల్‌ఫోన్ వినియోగదారులు పడ్డ కష్టాలు అన్నీ ఇన్నీ కావు.


నెల్లూరులోని జైన్‌గోల్డ్ షోరూంలో వారం వారం నిర్వహిస్తున్న లక్కీడ్రాలో విజేతను ప్రకటిస్తున్న తాతయ్య స్వామిని. ప్రక్కన షోరూం ఎండి నరేంద్రజైన్.

# రారెత్తిస్తున్న ఇళ్ల బాడుగలు

## అల్లాడుతున్న సామాన్యులు

జిల్లా కేంద్రమైన నెల్లూరు నగరంలో అద్దె ఇళ్లకు డిమాండ్ ఏర్పడింది. విద్యాసంస్థలకు పేరుగాంచడం, పోర్టు, ఇతరత్రా ప్రాంతాలకు అందుబాటులో వుండడంతో పలువురు వ్యాపారులు, ఉద్యోగులు తమ కుటుంబాలను నగరంలో ఏర్పాటు చేసుకొనేందుకు ఆసక్తి కనపరుస్తుండడంతో బాడుగ ఇళ్ల గిరాకీ పెరిగింది. దీనిని అవకాశంగా చేసుకొన్న గృహ యజమానులు ఇంటి అద్దెను పెంచిపడేశారు. చిన్న చిన్న ఇళ్లకు సైతం నాలుగు వేల నుంచి ఆరు వేల వరకు బాడుగ వసూలు చేస్తుండడంతో ఇళ్లకోసం తిరిగేవారు హడలిపోతున్నారు. ఐదులక్షలకుపైగా జనాభా గల నగరంలో చుట్టుప్రక్కల ప్రాంతాల నుంచి నగరానికి వచ్చి కాపురం పెట్టేవారి సంఖ్య అధికమయ్యింది. ముత్తుకూరు, తోటపల్లిగూడూరు, వెంకటాచలం తదితర మండలాల నుంచి పలువురు నగరంలో ఇళ్లు తీసుకొని పిల్లలను చదివించుకొంటూ తాము మాత్రం గ్రామాలకు రాకపోకలు సాగిస్తుండడంతో ఈ పరిస్థితి ఎదురౌతున్నదని పలువురు వ్యాఖ్యానిస్తున్నారు. ముత్తుకూరు మండలానికి చెందిన వారైతే అక్కడ తమకు వుండే సొంత ఇళ్లను అధిక బాడుగలకు ఇచ్చి నెల్లూరు వచ్చి ఇక్కడ బాడుగ ఇళ్లు తీసుకొని వుంటున్నారు. అందులోనూ లాభం కనిపిస్తున్నదని అందుకే ఇక్కడ వుంటున్నట్లు చెప్తున్నారు. పాఠశాలలు తెరుస్తుండడంతో అద్దె ఇళ్లకు డిమాండ్ ఏర్పడింది.

# గ్రేడింగ్ విధానంలో పదవ తరగతి ఫలితాలు


గ్రేడింగ్ తెలుసుకోవడం కోసం ఈసేవ కేంద్రం వద్ద బారులుతీరిన విద్యార్థులు.

పదవ తరగతి పరీక్షా ఫలితాలను ప్రప్రథమంగా గ్రేడింగ్ విధానంలో విడుదల చేసింది రాష్ట్ర ప్రభుత్వం. గతంలో ర్యాంకులు, మార్కులను తెలిపేవారు. దానికి భిన్నంగా, సిబిఎస్ఇ తరహాలో గ్రేడింగ్‌ను అమలు చేసింది. కార్పొరేట్ విద్యాసంస్థల మధ్య నెలకొన్న పోటీ కారణంగా ర్యాంకుల ప్రకటనలతో విద్యార్థులపై మానసిక ఒత్తిడి పెరుగుతున్నదని భావించిన ప్రభుత్వం దానిని నివారించేందుకు ఈ విధానానికి శ్రీకారం చుట్టింది. ఎ,బి,సి,డి అనే నాలుగు గ్రేడులుగా విభజించి ప్రతి దాంట్లోను రెండు గ్రూపులుగా వర్గీకరించారు. 591–506 మార్కులు వచ్చినట్లయితే ఎ1 గ్రేడ్‌గా, 505–478 మార్కులకు ఎ2, 476–434 మార్కులను బి1, 432–404 మార్కులను బి2, 403–375ను సి1, 374–345 సి2గా, 344–310 డి1, 309–304 డి2గా, 35 మార్కులు సాధించలేని వారిని ఫెయిల్ అయినట్లుగా భావించి ఇ గ్రేడ్‌గా చూపించారు.

పదవతరగతి పరీక్షా ఫలితాలు విడుదల చేసిన వెంటనే తమ మార్కులను తెలుసుకొనేందుకు ఇంటర్నెట్ సెంటర్‌లకు వెళ్లినవారికి గ్రేడ్‌లు కన్పించడంతో ఆశ్చర్యపోయిన విద్యార్థులు తర్వాత తెలుసుకొన్నారు. ఫలితాల కోసం వచ్చే విద్యార్థులతో నగరంలోని ఇంటర్నెట్ సెంటర్లన్నీ కిటకిటలాడాయి. ఈ ఫలితాల్లో జిల్లా కొంతమెరుగైన ఫలితాలను సాధించింది. 2006–07లో 72.6శాతం, 2007–08లో 74.4శాతం, 2008–09లో 77.6 శాతాన్ని సాధించగా ఈ ఏడాది 81.1.శాతంతో పురోగతి సాధించింది.

## జగన్ దెబ్బకు జడిసిందా?

మొదటి పేజీ కొరవ

పర్యటన మానుకోమని జగన్‌కు చిన్న మాట చెప్ప డానికి ఢిల్లీ దొరతనం సాహసించలేకపోతున్నది. ఒక్క మాటలో చెప్పాలంటే జగన్ దెబ్బకు జడుసు కొందని చెప్పవచ్చు. ఇక్కడ రెండు అంశాలు వారిని ఇబ్బంది పెడుతున్నాయి. వద్దు అని తాము చెప్పే మాట వినకుండా జగన్ పర్యటనకు వెళ్తే ఏమి చేయాలి అన్నది మొదటి ప్రశ్న. ధిక్కరించాడని చర్యకు ఉపక్రమిస్తే, రాష్ట్రంలో ప్రభుత్వం అస్థిరత్వం పాలయ్యే ప్రమాదం వుంది. చర్య తీసుకోకుంటే, అధిష్టానం బలహీనపడిందనే అభిప్రాయం ఏర్పడుతుంది. అది దేశం మొత్తం మీద పార్టీకి మం చిది కాదు. అట్లని యాత్రకు అను మతిస్తే, తెలంగాణలో జరిగే అన ర్థాలకు ఎవరు బాధ్యత వహిం చాలన్నది రెండవ ప్రశ్న.

జగన్ యాత్ర వల్ల పార్టీకి కలిగే ఉపయోగం ఏమీ లేదు. కానీ నష్టం మాత్రం అపారం. కానీ ఏమీ చేయలేని నిస్సహాయ తలో పడిపోయింది అధిష్టానం. రాష్ట్ర రాజకీయాలలో రోజు రోజుకు జగన్ బలవంతుడిగా స్థిర పడుతున్నాడని, దాని వల్ల ముందు ముందు చాలా సమస్యలు వస్తా యని రాష్ట్ర కాంగ్రెస్‌లోని ఒక వర్గం ఢిల్లీ పెద్దలను హెచ్చరిస్తు న్నది. కానీ వారు ఏమీ చేయలేని నిస్సహాయతలో పడిపోయారు. జగన్ దెబ్బకు జడుసుకొంటు న్నారు.



## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

### హాయ్ అన్న బాబు!

తెలుగుదేశం పార్టీ సర్వాధినేత నారా చంద్ర బాబునాయుడు ఒంగోలులో తుఫాన్ బాధితుల పరామర్శకు 22వతేదీ రేణిగుంట విమానాశ్రయంలో దిగారు. అక్కడ నుంచి కారులో నాయుడుపేట, నెల్లూరు, కావలిల మీదుగా ఒంగోలు చేరుకొన్నారు. జిల్లాలో మూడు చోట్ల జాతీయ రహదారిపై తన కోసం వేచివున్న కార్యకర్తలను బాబు పలకరిం చారు. జిల్లా పార్టీ నేత సోమిరెడ్డి చంద్ర మోహన్ రెడ్డి నుంచి జిల్లాలో లైలా తుఫాన్ వల్ల జరిగిన నష్టాల వివరాలు తెలుసుకొని కలెక్టర్ రాంగోపాల్‌కు ఫోనుచేసి బాధితులను ఆదుకోమని కోరారు.

### బస్సులో బల్లి!

గూడూరు ఎమ్మెల్యే బల్లి దుర్గాప్రసాద్ ఆర్టీసి బస్సులో ప్రయాణించి అందరినీ ఆశ్చర్యపర్చారు. చంద్రబాబు వరద బాధితుల పరామర్శలో భాగంగా ఒంగోలు వెళ్లిన దుర్గాప్రసాద్ తిరుగు ప్రయాణంలో ఆర్టీసి బస్సు ఎక్కి గూడూరు చేరుకొన్నారు. జిల్లాకు చెందిన ఎమ్మెల్యేలలో నువ్వుల వెంకటరత్నం నాయుడు, పట్రా ప్రకాశరావు ఆర్టీసి బస్సులో పయ నించేవారు.

### నెల్లూరు పోస్టల్ డివిజన్ ఘనత

తపాలా జీవిత పాలసీల సేకరణలో నెల్లూరు పోస్టల్ డివిజన్ విజయవాడ పోస్టల్ రీజియన్‌లోనే మొదటి స్థానంలో నిలిచింది. 42వేల పాలసీలు టార్గెట్ కాగా 52వేలు సేకరించి 37.27 కోట్లు తపాలా ఖజానాలో జమ అయ్యేట్లు చేశారు. దీనికి గాను విజయవాడ రీజియన్ పోస్ట్‌మాస్టర్ జనరల్ 16వ తేది ఎక్సలెన్స్ అవార్డును నెల్లూరు పోస్టల్ సూపరింటెండెంట్ ఎస్వీ ప్రసాద్‌కు అందజేశారు.

### కమ్మ సంక్షేమ సమితి

గత వారం కమ్మ జన సంక్షేమ సమితి కార్య వర్గ ఎన్నికలపై జమీన్‌రైతులో వచ్చిన వార్తకు సం ఘం గౌరవాధ్యక్షుడు సి.వి.నరసయ్య వివరణ పం పారు. ఎన్నికల సందర్భంగా ఎన్నికల అధికారి ఎటు వంటి అవకతవకలు, అక్రమాలకు పాల్పడలేదని స్పష్టం చేశారు. సంఘం ఖజానాలో ప్రస్తుతం 80 లక్షలు నిధులు నిల్వలేవని చెప్పారు.

### నిర్మల కొండారెడ్డికి సతీవియోగం

నెల్లూరులో నిర్మల వక్కపొడి తయారీదారు నిగా దేశవిదేశాల్లో పేరుప్రఖ్యాతులు గాంచిన బండి కొండారెడ్డి సతీమణి బండి లక్ష్మమ్మ(74) 23వ తేది మరణించారు. ఆమెకు ఇద్దరు కుమారులు, ముగ్గురు కుమార్తెలు. ఆత్మీయురాలిని కోల్పోయిన వారి కుటుంబానికి మా సానుభూతి.

### పావని కన్‌స్ట్రక్షన్స్ అధినేతకు పితృవియోగం

నెల్లూరులో అపార్టమెంట్ల నిర్మాణ రంగంలో తిరుగులేని మహిళగా పేరుగాంచిన పావని కన్‌స్ట్రక్షన్స్ అధినేత పావని తండ్రి చేబ్రోలు పెంచల నాయుడు 26తేదీ మరణించారు. కుటుంబ పెద్దను కోల్పోయిన పివి.రాఘవరావు, పావని దంపతులకు మా సానుభూతి.



## జనవాణి

2వ పేజీ కొరవ

య్యింది. ఏదైనా అన్యాయంపై ప్రశ్నిస్తే వారిని నక్సలైట్ అనడం పరి పాటయ్యింది. శత్రుసైన్యాలను మట్టుబెట్టను వాడాల్సిన సైనిక దళా లను దేశంలోని అపార ఖనిజ సంపదను దోచుకొనే ధనిక స్వాము లకు అండగా నిలబెట్టడం దారుణం. ఈ విషయాలన్నింటిని కూలం కషంగా చర్చిస్తూ సంపాదకుడు వ్రాసిన సంపాదకీయం వేయి ఆలో చనలు రేకెత్తించేట్లు చేసింది.

కె.పెంచలయ్య, నెల్లూరు

# సంస్మరణ



జననం
21-09-1918

మరణం
29-05-1997

## శ్రీ గునుపాటి రామచంద్రారెడ్డి గారు

మాజీ శాసనమండలి సభ్యులు

**పరమపదించి 29-05-2010 నాటికి పదమూడు సంవత్సరాలు పూర్తవుతాయి.**

**పదమూడవ వర్ధంతి**

సందర్భంగా వారి పవిత్రాత్మకు శాంతిని కలుగజేయమని భగవంతుని ప్రార్థిస్తూ శ్రద్ధాంజలి ఘటిస్తున్నాము.

**కుటుంబసభ్యులు**

# ప్రథమ వర్ధంతి



## డాక్టర్ ఎర్రంరెడ్డి ప్రసాద్‌రెడ్డి MDS

మాజీ మేనేజింగ్ డైరెక్టర్, అపోలోడెంటల్ హాస్పిటల్,చెన్నై.

మరణం : 03-06-2009

తన మంచితనంతో మా అందరి హృదయాలలో సుస్థిరస్థానం సంపాదించుకొన్న
మా 'ప్రసాద్' మాకు దూరమై సంవత్సరం అవుతుందంటే నమ్మలేకున్నాము.
నీ జ్ఞాపకాలు, తీపి గుర్తులు మా హృదయ ఫలకాలపై చిరస్థాయిగా నిలిచే వుంటాయి.

శ్రద్ధాంజలి ఘటిస్తూ...

భార్య : ఎర్రంరెడ్డి మమత

కుమారుడు : సాయి అన్వేష్

అత్త-మామ : పద్మావతమ్మ - డాక్టర్ జి. కొండారెడ్డి

బావమరిది : డాక్టర్ జి.మదన్‌మోహన్‌రెడ్డి - డాక్టర్ జి.దివ్యారెడ్డి

మరియు డాక్టర్లు, సిబ్బంది.

**డాక్టర్ కొండారెడ్డి దంత వైద్యశాల**, శంకరాగ్రహారం, నెల్లూరు. ఫోన్ : 0861- 2327235

Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore.